పొదుపుకు
సమర్థతకు
అసలు "మైకో" విభాగాలనే
గట్టిగా కోరండి!



**MICO**

LICENCE **BOSCH**

ఆమోదించబడిన ప్రతినిధులు :

మోటార్ ఇండస్ట్రీస్ కంపెనీ లిమిటెడ్, బెంగుళూరు

దుర్గ డీసెల్ హౌస్, గోపాల్ రెడ్డి రోడ్, విజయవాడ-2. ■ ఎమ్. జి. ఆటోమొబైల్స్, ఆటోమొబైల్ సెంటర్స్, కౌల్ బజార్, బళ్లారి-2. ■ నేషనల్ ఆటో & హార్డ్‌వేర్ స్టోర్స్, కాళేశ్వరరావు రోడ్, బకింగ్‌హామ్ పేట్, పి. ఓ. విజయవాడ. ■ పయొనీర్ ఆటోమొబైల్స్, ట్రంక్ రోడ్, గుంటూరు-1. ■ ప్రీమియర్ ఏజన్సీస్ బిల్డింగ్ 141, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్. ■ శ్రీ రామదాస్ మోటార్ ట్రాన్స్‌పోర్ట్ (ప్రైవేట్) లిమిటెడ్, పి. బి. 42, మెయిన్ రోడ్, కాకినాడ-1. శ్రీ రామదాస్ మోటార్ ట్రాన్స్‌పోర్ట్ (ప్రైవేట్) లిమిటెడ్, బందర్ రోడ్, విజయవాడ-2. ■ శ్రీ రామదాస్ మోటార్ ట్రాన్స్‌పోర్ట్ (ప్రైవేట్) లిమిటెడ్, రోడ్, అర్. ఎస్. విశాఖపట్నము-4.






# అమృతాంజన్
లిమిటెడ్ వారి
# గ్రైప్ మిక్స్చర్

తయారీ :
అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు-4

PDS AGM 472 TE

# ఉత్తరాలు

## క థ లు

డి. కామేశ్వరిగారి "దేశంకోసం" అన్న కథ చాలా బాగా యున్నది. ఉద్రేక పరచే మాటలు 'కథ చదువుతున్నంత సేపు శరీరాన్ని గగుర్పొడిపింప చేసినవి. ఇటువంటి కథలు అందచేస్తున్నందుకు డి. కామేశ్వరి గారికి నా హృదయపూర్వక అభినందనలు.

కథలో కొన్ని పొరపాట్లున్నందుకు చాల విచారిస్తున్నాను. పైలట్ ట్రయినింగు సంవత్సరమని వ్రాసినారు. కాని ట్రయినింగు 1 సంవత్సరం 6 నెలలు. కథానాయకుడైన గోపి హంటర్ పైలట్. ట్రయినింగు కొరకు ఇంగ్లాండు వెళ్ళవలసిన అవసరంలేదు. అది మన దేశంలోనే ఉన్నది. గోపి హంటర్ పైలట్ అతడు హంటరు విమానములతో శాబర్ జెట్లను కూల్చినాడు. హంటరు విమానము బ్రిటన్‌లో తయారయినది. కావున మన దేశంలో తయారయిన విమానములతో కూల్చినాడనడం అంత సమంజసంగాలేదు. మరియు అతను హంటరు ట్రయినింగు కోరుకొన్నాడని వ్రాసినారు. ట్రయినింగులో వారివారి సామర్థ్యమును బట్టి జెట్ పైలట్, ట్రాన్స్‌పోర్టు పైలట్‌గా విభజిస్తారు.

పి. ఎస్. నాయుడు (అయ్.ఏ.ఎఫ్. కలకత్తా)

* * *

ద్విభాష్యం సూరీడుగారు రచించిన "పూహల అనుభవాలు" కథ చదివాను. ఆ కథ చదవగానే నేను ఈ ఉత్తరాన్ని రాయక వుండలేక పోయాను. రచయిత ఈ కథను చాలా బాగుగా వ్రాసినారు.

యస్. కె. ఖాదర్‌అలి (గూడూరు)

* * *

"నారాయణ చేసిన పరిష్కారం" కథలో శ్రీ న్యాయపతి గోపాలకృష్ణగారు ఠికాణా అంటే నమ్మకం అని తప్పు రాశారు. ఒరియాలో ఠికాణా అంటే అడ్రసు.

డి. జె. పాత్రో (బరంపురం)

## వ్యా సా లు

పద్మశ్రీ భానుమతి గారితో శ్రీ పి. కనకాంబరరాజు గారి "ఇంటర్‌వ్యూ" చదివాను— ఆవిడగారు ఇచ్చిన సమాధానాలు నాకు చాలా బాధను కల్గించాయి— దానికి కారణం ఆవిడ నా అభిమాన నటి కావటం — ఆమె నుండి నేనలాంటి ప్రత్యుత్తరాలు వస్తాయని భావించ లేదు— ప్రతి సమాధానం, వంకరగా, వ్యంగ్యంగా, విచిత్రంగా ఉన్నాయి— — ఉదాహరణకు:

ప్ర: హైద్రాబాదుకి నివాసం మార్చా లని మీరేమైనా అనుకుంటున్నారా?

జవాబు:— అటువంటి దురభిప్రాయం నాకేమీ లేదండీ—.

ప్ర: మీ స్వంత రచన చేసి సినిమా తీయాలనుకుంటున్నారా?

జ: దానికి జవాబు—

"అంత దురాశ లేదుగాని నాకా స్థోమత వుంది"

పి. నాగేంద్ర నారాయణ (కరీంనగర్)

* * *

"కమ్యూనిస్టు దేశాలలో కామరాజ్" వ్యాసాలు చాలా బాగుంటున్నాయి. రష్యా ప్రజలకు మన దేశం మీదయున్న గౌరవాభిమానాలు, తాజిక్ ప్రజల సాంఘిక వ్యవస్థ విశదంగా వ్రాసేరు. కామరాజ్ నిరాడంబరత్వము, ప్రజాభిమానము ప్రతీ చోటా కొట్టవచ్చినట్లు కనబడుతూంది. ఇటువంటి వ్యాసాలు పాఠకులకు మిక్కిలి ఉపయోగకరంగా వుంటాయి. రచయితకు మా మనఃపూర్వక అభివందనందలు.

భోగరాజు బలరామమూర్తి (భువనేశ్వరం)

* * *

21—10—66 వ తేదీ వారపత్రికలో మీరు ప్రచురించిన "రాజ్యాలేలిన రాణులు" వ్యాసంలోని ఆఖరు పేరాలో "ఊహించడం కష్టంకాదు" అన్నారు. రచయిత్రి ఎ. రుద్రాంబ గారి ఉద్దేశ్యం ప్రకారం, ఆ రాణి, మార్కోపోలో పేర్కొనిన రాణి రుద్రమదేవి అనుకొంటాను. లేకపోతే "ఊహించడం కష్టంకాదు"అని వ్రాయరు. ఒకవేళ నా అభిప్రాయమే వారి అభిప్రాయం అయితే మాత్రం క్షమార్హుడను.

"13 వ శతాబ్దంలో భారతదేశంలో పర్యటించిన "మార్కోపోలో" పేర్కొన్న రాణి, రుద్రాంబకాదు. 'రుద్రాంబ' అని నూటికి 99 మంది అనుకొంటారు. కాని, అతడు పేర్కొన్న రాణి, 'గణపాంబిక'. ఎందువల్లనంటే, 1290 లోనో, 1292 లోనో మార్కోపోలో 'ఆమె 40 సంవత్సరాల నుండి రాజ్యంచేస్తూంది'అని వ్రాశాడు. రుద్రమదేవి రాజ్యానికి వచ్చినది 1262లో గాని, ఆతర్వాత గాని అయివుండాలి. ఇదొక ఆధారం. కనుక, మార్కోపోలో పేర్కొన్న ఆరాణి "గణపాంబిక". సోదర పాఠకులందరూ గ్రహిస్తారనే ఉద్దేశ్యంతో ఇది వ్రాస్తున్నాను:

"అలా కాకుండా, దీనిని కాదనే వారు వ్రాస్తే, పత్రికా ముఖంగా గాని, వ్యక్తిగతంగా గాని, నిరూపించి చూపుతాను.

మెదడుకు మేత, చాలా ఉత్సాహ జనకంగా ఉన్నది—ధన్యవాదాలు.

సి. రవిశర్మ. (హైదరాబాద్)

## జ వా బు

"మార్కోపోలో పేర్కొన్న రాణి రుద్రాంబ కాదు, గణపాంబ" అని శ్రీ సి. రవిశర్మగారు బల్లగుద్ది చెప్పడం చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది ఏ చరిత్ర జిజ్ఞాసువుకైనా.

మార్కోపోలో ఉల్లేఖంలో గణపాంబ ప్రసక్తే లేదు. గణపతిదేవునికి రుద్రాంబ పెద్ద కుమార్తె, గణపాంబ చిన్న కుమార్తె. రుద్రాంబ తన శౌర్యగాంభీర్యాది గుణాలతో మగ వేషంతోనే తండ్రికి రాజ్య పరిపాలనలో చేదోడు వాదోడుగా వుంటూ వుండేదని, గణపతిదేవుడు ఆయమను పురుషునిగానే ప్రఖ్యాపనచేసి యువరాజుగా పరిగణించాడని చరిత్ర ఉద్ఘోషిస్తున్నది.

రుద్రమదేవి 1262లో రాజ్యానికి వచ్చి 1295 వరకు— ముప్ఫయిమూడు సంవత్సరాలు పాలించినా, అంతకు ముందు కూడా యౌవరాజ్యాధికారంతో దాదాపు గణపతిదేవ సదృశురాలుగా పరిపాలనతో సంబంధం కలిగే వుండేది. అందువల్లనే మార్కోపోలో రుద్రాంబ నలభై సంవత్సరాలుగా రాజ్యం చేస్తున్నదని అన్నాడు. 'నలభై' అన్న మాటను యథాతథంగా తీసుకొనడం పొరపాటవుతుంది. ఎందుకంటే, మార్కోపోలో రుద్రాంబను గణపతిదేవుని భార్య అని భ్రమ పడ్డాడు. రుద్రాంబ తల్లి పేరు సోమదేవి.

అందువల్ల మార్కోపోలో ఉల్లేఖంలో రాణి రుద్రాంబే కాని, గణపాంబ కాదని నా బుద్ధికి తోస్తుంది. —జిజ్ఞాసువు.

* * *

శ్రీమతి ఎమ్. సత్యవతిగారు, "హరిజన స్త్రీగా నా అనుభవాలు" అను వ్యాసం వల్ల యిప్పటికీ హరిజనులు నిజముగా అనుభవిస్తున్న అవమానాలు, యిక్కట్లు అనుభవశాలిగా అన్ని విషయములు కచ్చితముగా ఖండించి, చిత్రించి మన పాఠక సోదర, సోదరీ మణులకు ఆదర్శంగా అందజేసినందులకు, నా అభినందనలు చాలననుకుంటా!

యమ్. కె. రావ్. (చిమల్‌పహాడ్)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 18—11—'66

పరాభవనామ సం॥ కార్తీకమాస॥ శు॥ షష్ఠి

సంపుటము : 59 సంచిక : 10

*

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము,
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

చందా వివరాలు :
భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధసంవత్సర చందా | 16.00 |


## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయితగాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచనేనని, దేనికీ అనుకరణ కాదని హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీ లేని రచనలను ప్రచురణకి స్వీకరించలేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక

# మనలో మాట

విశాఖపట్నంలో ఉక్కు కర్మాగారం స్థాపన విషయమై జరిగిన సంచలనంవల్ల ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి ప్రత్యేకసంచిక సకాలంలో పాఠకులకి చేరే అవకాశం లేకపోయింది. ఈ సందర్భంలో [illegible] సభలో ప్రధానమంత్రి, శ్రీ టి. ఎన్. సింగ్‌లు చేసిన ప్రకటనలు ప్రజలలో కొంత అసంతృప్తి, నిరాశ కలిగించాటం నిజం. "దౌర్జన్యానికి లొంగుతున్నాము" అనే భావం కలిగించరాదనే ఉద్దేశంతో కేంద్రప్రభుత్వ నాయకులు పై విధంగా ప్రకటనలు చేసుకొంటున్నట్లు మనం అర్థం చేసుకోవలసి వస్తుంది. కాని, స్వాతంత్ర్యం తర్వాత ప్రభుత్వం చేస్తూ వచ్చిన కొన్ని నిర్ణయాలని చూస్తే సహేతుకంగా సమర్పించిన కోరికలకన్నా దౌర్జన్యానికే ప్రాముఖ్యత ఇవ్వటం జరుగుతూ వచ్చిందన్న అనుమానం కలగక మానదు. పొట్టి శ్రీరాములు [illegible] తర్వాత జరిగిన సంచలనం తర్వాతనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ప్రకటన వెలువడటం, బొంబాయిని మహారాష్ట్రంలో కలపటానికి సందేహించి చివరికి అంగీకరించటం, మద్రాసులో హిందీకి వ్యతిరేకంగా వచ్చిన ఆందోళన తర్వాత కేంద్రంలో హామీలు ఇవ్వటం మొదలయినవి ఈ అనుమానాన్ని బలపరుస్తాయి. ఇంతేకాక మన రాష్ట్ర నాయకుల అశ్రద్ధ వల్లనయితేనేమి, కేంద్ర రాజకీయాలలోని సూక్ష్మాలవల్ల నయితేనేమి ప్రారంభం నుంచి ఆంధ్రదేశానికి కొంత అన్యాయం జరిగిందనటంలో సందేహంలేదు. విశాఖపట్నం ఉక్కుకర్మాగారం విషయంలో చెలరేగిన అలజడి ఎంతో కాలంగా ప్రజలలో అణగారి ఉన్న అసంతృప్తి బయటపడటానికి నిదర్శనం. ఈ అలజడిలో కొందరు సంఘవిద్రోహులు, అవకాశవాదులు కలగచేసుకున్నారని అంగీకరించాలి. 'ప్రజల ఆస్తి' అనదగిన వస్తువుల విధ్వంసం మితిమీరటం మంచిది కాదని అంగీకరించాలి. కాని, అసలు ఇటువంటి పరిస్థితి రాకుండా చూడటమే ప్రజాస్వామ్య ప్రభుత్వాల కర్తవ్యం. (హిందీ ఆలజడి చెలరేగినప్పుడు కేంద్రంలో కొందరు తమిళ నాయకులు చూపిన అప్రమత్తతతో నేడు కేంద్రంలో ఉంటున్న కొందరు తెలుగు నాయకుల ఉదాసీన వైఖరిని పోలిస్తే మనకి ఎన్నో సందేహాలు వస్తాయి).

ఈ వారం శ్రీకృష్ణ తమ న్యూఢిల్లీ లేఖలో పై విషయాన్ని గురించి రాశారు. (శ్రీకృష్ణ మాతృభాష హిందీ. ఆర్థిక విషయాల వ్యాఖ్యానం ఆయన ప్రత్యేకత అని పాఠకులు గమనించి ఉంటారు. శ్రీ శ్రీకృష్ణ వ్యాసాలు చాలా, భారతదేశంలో, విదేశాలలో కూడా ప్రచురణ అయ్యాయి.)

ఈ సంచిక వెలువడే సమయానికి పరిస్థితులు చల్లబడి అందరికీ న్యాయం చేకూర్చే నిర్ణయాలు వెలువడుతాయని ఆశిస్తున్నాము.

* * *

పై వారం 'ఆమ్రపాలి' సమాప్తం అయిపోతుంది. ఆ పై వారమే మరొక సీరియల్ నవల మొదలవుతుంది. వివరాలు పై సంచికలో.....

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి సుకన్య (ఫోటో: ప్రభాకర్)


దీపావళి బాణాసంచా
బెంగాల్ బంధ్
ఆంధ్ర ప్రదేశ్ బంధ్
ఉక్కు కర్మాగారం గొడవ
ఆహార ఉద్యమం
గో సంరక్షణ ఉద్యమం
ప్రజ
మరిన్ని ఉద్యమాలు
విద్యార్థుల కల్లోలం...
ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవలి పరిణామాలు
నా జేబు నా సొత్తు
కుంభ వర్షం
కాంగ్రెసు పలుకుబడి
మద్రాసులో
ఇటీవల గాలివానలో
పునః తేటముంచే యత్నం.
OOMMEN

శ్రీకృష్ణ

# విద్యార్థుల అల్లర్లు - విశాఖ ఉక్కు కర్మాగారం

విద్యార్థుల అల్లర్ల వెనక ఎవరున్నారు అనే విషయం పార్లమెంటు చర్చల్లో ప్రప్రథమం అయింది. రామమనోహర లోహియాగారు తమ ముఠాతో పాటు ఆహార సమస్య గురించి చర్చిస్తే, కమ్యూనిస్టు నాయకుడు ముఖర్జీగారు, రేణు చక్రవర్తి, మరో అంచున నిలబడి యస్. యమ్. బెనర్జీగారు, విద్యార్థుల అల్లర్ల గురించిన చర్చను తీసుకు వచ్చారు. లోక్ సభలో పోట్లాట ఎక్కడ ప్రారంభమైందీ అంటే, స్పీకరుగారు చర్చల్ని నిలుపుదల చేయమన్నప్పుడు. సర్దార్ హుకుంసింగ్‌గారి అభిప్రాయం మీద అందరూ విరుచుకు పడ్డారు. ప్రతిపక్షాలలోని 'జగజెట్టీలు' చొక్కా చేతులు పైకి మడచి, కాంగ్రెసు పార్టీని ఎదుర్కోడానికి, ముఖ్యంగా ప్రస్తుత ప్రభుత్వాన్ని అవహేళన పాలు చేయడానికి ముందు కురుకుతున్నారని, సర్దార్ హుకుంసింగ్ గారే స్వయంగా మొన్న ఒక ఉపన్యాసంలో సెల విచ్చారు. ప్రతిపక్షాలు ఇప్పుడు సభాపతి గారికి విషమ పరిస్థితుల్ని తెచ్చిపెట్టాయి. చర్చల్ని నిలుపుదల చేశారంటే చూసుకోండి, ఏం చేస్తామో అంటున్నారు.

మన ప్రజా ప్రభుత్వంలో పార్లమెంటు చరిత్ర పరికించినట్లయితే, అది పుట్టినప్పటి నుండీ ముగింపుకు ఆరంభంగాను, ఆరంభానికి ముగింపుగాను వుంది పరిస్థితి. ఒక డజను మంది ప్రతిపక్ష వాదులు ఇలా నిరంతరంగా వున్నట్లయితే అది మన ప్రజా ప్రభుత్వ పార్లమెంటరీ విధానం ముగింపుకు మొదలై సర్వమంగళ మవుతుందన్న మాట ఖాయం.

మన రాజధానిలో జరుగుతున్న విషయాల్ని అవలోకించినట్లయితే ఎవళ్ళకైనా వణుకు పుడుతుంది. ప్రభుత్వ విమర్శకులు 'పరిశుభ్రమైన పని' చేసినందుకు గాను వారిని కేంద్ర మంత్రులు అభినందిస్తున్నారు! భూతలింగంగారి మీద పంతకాల మహజరును ప్రోత్సాహ పరిచింది ఒక మంత్రిగారేనని లాబీ వర్గాల ద్వారా తెలుస్తున్నది. ఆ పంతకాలధారుల్లో చాల మంది కాంగ్రెసు వారే. అందులో దక్షిణాది వారి పాలా ఎక్కువే!

పార్లమెంటు చర్చల్లో ఓం ప్రథమంగా ఆహార సమస్య గురించిన ప్రశ్న తేబడింది. అది ఆహార మంత్రిగారైన సుబ్రహ్మణ్యం గారిచేత సమాధానం చెప్పబడింది. వేసిన ప్రశ్నలన్నీ హిందీలోనే వేశారు. అవీ చాల ఘాటుగా వున్నాయి. సుబ్రహ్మణ్యంగారూ ఏం తీసిపోలేదు, ఆయనా అంత ఘాటుగాను సమాధాన మిచ్చారు. ఆయన సమాధానం కోశాగారం బెంచీల మీద కూర్చున్న సహమంత్రుల్ని కూడా ఆశ్చర్య పరచింది!

'ఆంగ్లో అమెరికన్ ఫార్మసియేటికల్స్' ప్రభావం ప్రభుత్వం మీద బాగా ఒత్తిడి చేసిందని ఆరోగ్యమంత్రిగారు ప్రవేశ పెట్టిన బిల్లును అణచివేయడానికి శ్రీమతి రేణు చక్రవర్తి నాయకత్వంతో వున్న కమ్యూనిస్టులు ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో డా. సుశీలానయ్యర్‌గారు ఉన్న స్థానాన్ని విడచి వెళ్ళి ప్రధాన మంత్రి గారి చెవి కొరికారు. అయినా పాచిక పారలేదు. బిల్లును ఆపాదించలేక పోయినందుకు చింతిస్తున్నామని ప్రభుత్వ నాయకులు ప్రకటించినపుడు డా. సుశీలానాయర్ ఎంతో నిరుత్సాహపడి పోయారు.

విద్యార్థుల అల్లర్ల ప్రసక్తి తీసుకు వద్దాం. కేంద్రరంగంలో మంత్రులందరూ 'సొంత డబ్బా'ల కోసం ప్రాకులాడుతున్నారు ఎవరి మట్టుకు వారు పోలీసుల్ని దుయ్యబడుతున్నారు. యూనివర్సిటీ వాతావరణంలో 'దౌత్య వ్యవహారాల విశేషాధికారాల' కోసం వైస్ ఛాన్సలర్లు పట్టుబడు తున్నారు. ఆలిఘర్ యూనివర్సిటీ ఆవరణలో



విజయవాడ గాంధీనగర్ సెంటర్‌లో సంజీవరెడ్డి విగ్రహం ధ్వంసంచేసిన అనంతరం మిగిలిన పద్మాకారపీఠం, (ప్రక్కన) విగ్రహాన్ని ధ్వంసం చేస్తూండగా చూస్తున్న ప్రజాసందోహం.

# న్యూ ఢిల్లీ లేఖ

పిల్లలూ పంతుళ్ళూ కలిసి వైస్ ఛాన్సలర్ని చంపడానికి ప్రయత్నించినప్పుడు అందరూ ప్రభుత్వాన్ని నిందించారు.

అతిమా వాళ్ళకు కూడా వర్తించే లాగున విద్యార్థులకు ఒక 'ప్రవర్తనా నియమావళిని' మన దేశీయాంగ మంత్రి లాలా గుల్జారీలాల్ నందాగారు తయారు చేస్తున్నారు. ఆరోగ్య మంత్రిగారైన డా. సుశీలా నయ్యర్ గార్ని విడచిపెట్టడానికి వీల్లేదు. ఆమె కూడా విద్యార్థుల అల్లర్లకు మందు కనిపెట్టారు!

దేశీయాంగ మంత్రి నందాగారు జ్యోతిష్కుల్ని సంప్రదించడంలో క్షణం తీరిక లేకుండా వున్నారు. కొన్ని నక్షత్రాలు అటూ యిటూ అయిన కారణం చేత ఈ అల్లర్లు రేగాయని, అవి సరిపుచ్చుకోగానే అల్లర్లు సద్దుమణిగి పోతాయని ఆయనకు జ్యోతిష్కులు చెప్పినట్లు లాబీ వర్గాల ద్వారా తెలుస్తోంది. 1962 లో చైనా వాళ్ళు వెన్నిచ్చి పారిపోయారూ అంటే దానికి కారణం ఢిల్లీలోని గొప్ప జ్యోతిష్కుని ప్రభావమే అని ఆయన అంటారు!

యూనివర్సిటీ పరిపాలకులు చేసిన తప్పు లేదు. విద్యార్థుల అల్లర్ల గురించిన మూల కారణాన్ని తెలుసుకోడానికి వాళ్ళ కోర్కెల్ని వినేందుకు ఒక కమిటీని నియమించింది. విద్యార్థుల కోర్కెల్లో కొన్ని సహజమైనవేనని వారికి తెల్లమైంది. ప్రశ్న ఏమిటీ అంటే, ఢిల్లీ విశ్వవిద్యాలయానికి అంతగొప్ప వైస్ ఛాన్సలర్ వుండీ ఇన్నేళ్ళూ ఎలా కళ్ళు మూసుకు కూర్చున్నారూ అని. విశ్వ విద్యాలయం క్రింద విద్యాలయాల్ని ఏడాదికోసారి తణిఖీ చేయడానికి కొన్ని వర్గాలున్నాయి. అవి తమ పని చేస్తూనే వున్నాయి. విశ్వవిద్యాలయ అధికారులు చర్చించడం కోసం, అవి సంవత్సరం వారీ రిపోర్టులు పంపిస్తున్నాయి. మరి విద్యార్థుల కోర్కెలన్నీ సమస్యలుగా ఎందుకు మిగిలి పోయాయి?

విద్యార్థుల ఇబ్బందులకీ విశాఖపట్టణంలో ఉక్కు కర్మాగారానికి పొత్తు ఎక్కడ? ఉత్తర ప్రదేశ్‌లో ప్రభుత్వం మారాలని అక్కడి గోల! యువజన కాంగ్రెసు లీడరు దినేష్‌సింగ్‌గారు ఇంతవరకూ ఏం చేస్తున్నట్లు మరి?

దేశంలోని ఆర్థిక రాజకీయ సంక్షోభమే ఈ విద్యార్థుల అల్లర్లకు కారణమని అనుమ చెప్పబడుతూ వుంది.

1942 లో బెంగాల్ క్షామాన్ని పురస్కరించుకుని విద్యార్థులు దౌర్జన్యాలకు ఒడిగట్టారా? పూర్వం గాంధీగారు స్వరాజ్యాందోళన సమయంలో విద్యార్థుల్ని పురెక్కించారు అనుకుంటే, అప్పుడు పాఠశాలలు, కళాశాలలు పూర్తిగా మూతపడలేదే? 'క్విట్ ఇండియా మూవ్‌మెంటు', హిందూ దేశపు ద్వారాల దగ్గర జపాను యుద్ధం సమయాల్లో ప్రభుత్వ బలాన్ని దృష్టిలో వుంచుకోవాలి. ప్రభుత్వమప్పుడు విచ్ఛిత్తిని సక్రమంగా కాపాడగల్గింది. ప్రజాప్రభుత్వం అనే పేరుతో వుండి, యిప్పుడు మన ప్రభుత్వం అశక్తతను కనబరుస్తోంది. ఎంత వరకు మునుగుతుందో భగవంతునికే తెలియాలి. దీనికి ఈ విద్యార్థుల అల్లరు ఒక చిహ్నం. ప్రభుత్వ వర్గంలో అనైక్యత, ప్రభుత్వ యంత్రాంగం యొక్క విచ్ఛిత్తి వీటన్నిటికి కారణం.

వెనక్కు తిరిగి చూస్తే మన ప్రధాన మంత్రిగారి మొట్ట మొదటి కేంద్ర మంత్రి వర్గం ఎన్నిక మేలైనది. నెహ్రూ, శాస్త్రిగారల మంత్రి వర్గాల్లోంచి కొంద రిని వేరు చేయడానికి ప్రధాన మంత్రి కృషి చేశారా అన్న విషయం దాచుకో నక్కరలేదు. కాని ఆమె అలా చేయడానికి వీలు పడలేదు. దానికి చాలా ఒత్తిడులు కారణాలు వున్నాయి. స్వతంత్రంగా ఆమె తన విధానాన్ని పాటించివున్నట్లయితే దేశం మరింత బాగుపడి వుండేది, రాజకీయాల్లో మెరుగుదల కనిపించేది.

కాంగ్రెసు అధ్యకుడు కామరాజ్ గారు విస్మయమైన మనిషి. మద్రాసు అసెంబ్లీ నుంచి ఆయన ఎన్నికకు నిలబడుతున్నారనే విషయం ధృవపత్రాల ద్వారా తెలుస్తున్నది. రాబోయే మార్పుల్ని ఆయన పసిగట్టారు. ముఖ్యంగా నాలుగు దక్షిణాది రాష్ట్రాలలోని రాజకీయ సంచలనాన్ని ఆయన బాగా గమనించి వున్నారు.

విద్యార్థుల అల్లర్ల మూలకంగానే కాక పోయినా, ఆంధ్రలో ఉక్కు కర్మాగారం ఆవశ్యకతను ప్రభుత్వం గుర్తించివున్నదే. అయినా రూర్కేలా, భిలాయ్, దుర్గాపూర్‌లలోని ఉక్కు కర్మాగారాల విస్తరణకు అత్యధిక ప్రాధాన్యమిచ్చింది.

ఇక్కడ కొంత వివరణ కావాలి. ప్రభుత్వ శ్రామిక విధానం యొక్క బలహీనతవల్ల ఈ పైమూడు కర్మాగారాలు పాతిక శాతం మాత్రమే ఫలాదాయాన్ని యిస్తున్నాయీ అంటే మన పథకం ఎంతమేరైందీ వూహించుకోవచ్చు. ఉదాహరణకు, రైళ్ళ పట్టాలను తదితరమైన వాటిని ఉత్పత్తి చేసేందుకు భిలాయ్ ఉక్కు కర్మాగారం నియమించబడింది. మార్గదర్శకుడైన పీతాంబరం పంత్‌గారు ఆర్థిక సూత్రాల ననుసరించి పథకానికి కొన్ని అభివృద్ధి సూచనల్ని చేశారు. ముఖ్యంగా వ్యాపారానికి రాకపోక సౌకర్యాలు విరివిగా వుండాలన్నారు. ఆ పద్ధతి మీదనే భిలాయ్‌లో రైలు పట్టాల ఉత్పత్తి ఏర్పాటయింది. పంత్ గారి పథకాన్ననుసరించి అధిక ప్రయోజనాలేమీ సాధించుకోలేకపోయాము. భిలాయ్ లో రైలు పట్టాలు తుప్పు పట్టిపోతున్నాయి! పంత్‌గారు అభివృద్ధి సూచనల్ని అనుసరించే, భిలాయ్ ఉక్కు కర్మాగారాన్ని విస్తృత పరిచేందుకు ప్రణాళికల్లో మళ్ళీ ఎక్కువ కేటాయింపు జరగాలి?

ప్లానింగ్ కమిషన్ వ్యవహారం చూస్తే దక్షిణాదికి ఉక్కు కర్మాగారం లభిస్తుందీ అనేది కల్ల! కాని, జర్మనులు సహాయ నిరాకరణ చేసినా రూర్కేలా కర్మాగారాన్ని అభివృద్ధి పరచేందుకు అవకాశం వుంది! 30 మిలియన్ కోట్ల సహాయాన్ని పొందిన బ్రిటిష్ వారి సహాయంతో దుర్గాపూర్ కర్మాగారాన్ని మరింత విస్తృత పరచడానికి అవకాశం వుంది. భేష్....! ఆంధ్రలో ఉక్కు కర్మాగారం కోసం అమెరికా, బ్రిటిష్, జర్మన్, ఇటలీ, ఆస్ట్రేలియా దేశాల వారు సహాయం చేస్తామంటూ ముందుకు వస్తున్నా మనకు అక్కర్లేదు పొమ్మంటున్నాము. ఎంతటి జాతీయ సమానత! ఉత్తరాదిన మూడు కర్మాగారాలు పాతిక శాతానికి 'గొప్ప' ఉత్పత్తి నిస్తున్నప్పుడు మరో కర్మాగారం ఆంధ్రలో ఎందుకు, మతి పోయిందా? అంటూ అడగడానికి కూడా అవకాశం వుంది మరి! మూడు కర్మాగారాలుండి మనకు వొరిగిం దేమిటి? విస్తృతం చేసిన మేరకు ఆదాయం వచ్చినప్పుడు ఎవరు ప్రశ్నిస్తారు? ఈ సారి పెట్టుబడితో కావాల్సినంత ఉత్పత్తి లభిస్తుంది అని సమర్థిస్తున్నారు.

మనసా వాచా కర్మా ఆంధ్రలో ఉక్కు కర్మాగారం పెట్టాలని మన ప్రభుత్వం తలచుకుంటే దుక్క ఇనుము మేరకయినా ఒక కర్మాగారాన్ని నెలకొల్పవచ్చు.

శ్రీయుత కామరాజ్ గారు తమ స్వయం రాష్ట్రానికి ఎందుకు తిరిగి వెళ్తున్నారో ఆలోచించదగ్గ విషయమే!




గణ గణ గంట మ్రోగింది. పిల్లలు తరగతుల్ని వదలి లైనులో నిలబడ్డారు. అవతల బ్యాండ్ మ్రోగుతోంది. పిల్లలు చక్కగా నడుస్తూ పెరేడ్‌కి వెళ్తున్నారు. బెల్ అయిపోయింది అనుకుంటూ గబగబా ప్రవేశించింది 'రాధిక'. అప్పటికే వచ్చివున్న టీచర్స్ అందరి దృష్టి నాలుగురోజుల శలవు తరువాత వచ్చిన రాధికమీదపడింది.

"రాధికా! పెళ్లి బాగా జరిగిందా?' అన్నపలకరింపుకి 'చాలా చాలా బాగాజరిగింది' అనిసంతోషంగా చెప్పింది రాధిక—

'అబ్బ! జీవితమంటే మీదేనండి. మీకు మీచెల్లెలు ఎంతో ఋణపడి ఉండికదూ!' రాధిక అంటే అమితంగా ఇష్టపడి, ప్రతి కదలికనూ పరిశీలించి మెచ్చుకొని సానుభూతి చూపే హృదయం గల రామలక్ష్మి మాట అది.

'ఏయ్!అమ్మాయ్! రాధికా, పెళ్లి బాగా జరిపించేశావ్. మొత్తానికి అసాధ్యురాలవమ్మాయ్!' అంటూ భుజం చరిచింది సంతోషంగా నవ్వుతూ లలితాంబ గారు.

ఆమెకు రాధిక సొంతచెల్లెలు లాంటిది. అలాగే చూసుకుంటుంది రాధికను.

'ఏమే!రాధీ! నీవరసేమీ బాగాలేదు. నీ పెళ్ళికాకుండా నీచెల్లికి చేసేవేమిటే! నువ్వెంతేనేమిటే?" బాధగా అంటూన్న నాగరత్నం మాటవింటూ నిర్వికారంగా నవ్వింది రాధిక. వీటన్నిటికి ఒకటేనవ్వు. ఇంతలో సెకండ్ బెల్ వినిపించింది. నెమ్మదిగా పడక పోగించింది రాధిక తన డ్యూటీకి.

ఆసాయంత్రం, "మిమ్మల్ని చూడకపోతే ఆరోజంతా ఒదోలా ఉంటుందండి నాకు. ఏమిటి బాగున్నారా! ఎలా జరిగిందిపెళ్లి" అంటూ నవ్వుతూ వచ్చింది, సుగుణమ్మ.

మనసులో అనేకరకాలఆలోచనలు. పైకి మాత్రం నవ్వింది రాధిక.

రాధికవయస్సులో చిన్నదైనా, తను చేసిన ఘనకార్యానికి ఎంతో పెద్దరికం వచ్చింది ఆమెకు.

యౌవ్వనంలో ప్రవేశించకుండానే ఎంతో అప్యాయంగా చూసుకొనే తండ్రి ప్రేమకు కరువై పోయింది లగాయితు రాధిక జీవితం మలుపు తిరిగింది.

చిన్నప్పటినుంచి ఒకేయింట్లో పెరిగి, 'నీబావ, బావ!' అంటూంటే తెలియకుండానే ప్రేమను పెంచుకున్నారు రఘూ, రాధికలు. ఎన్నోకలలు కనేది రాధిక వికసించని వయస్సులోనే.

విధి వైపరీత్యం! తండ్రి మరణంతో చెట్టుకొకక్కటి అన్నట్టు అయిపోయి ఆ సంసారంలో రఘూ రాధిక విడిపోయారు. యౌవనంలో అడుగుపెట్టి రాధిక, రఘూమీద ఎన్నో ఆశలు పెంచుకొంది. కాని విడిపోయిన రఘు, ఇంకొక సొత్తయిపోయాడు. ఉన్న ఒక్కఅన్నగారు త కేమీ పట్టనట్టు దూరతీరాలకు వెళ్ళి పోయాడు. తల్లిని, చెల్లెల్ని పోషిం బాధ్యత మిగిలిన రాధికమీద పడింది

ఎస్సెస్సెల్సీ ముగించిన తర్వాత బయటవున్న ఇన్స్టిట్యూట్‌కి వెళ్ళి టై నేర్చుకొనేది. ప్రతిరోజు నడచివెళ్ళి ఎంతో కష్టపడేది. రాధిక ఎప్పుడు ఉద్యోగ చేస్తుందా! అని ఎదురుచూచే కుటుంబ బంధువర్గం ఆమెది. పరీక్షలు బాగా వ్రాసింది. కాని ఏం చెప్పగలం 'ఇన్ని ఆశలుపెట్టుకున్న నా పరీక్షపోతుదేమో' అని చాల దిగులుపడేది...ఎం తైతేనేం, పాసైంది. మిగిలిన పరీక్ష పూర్తిచేసింది. దేవుడంటే మంచి నమ్మక గల రాధికకు వెంటనే ఉద్యోగం వచ్చిం ఇంతవరకు పెంచిన తల్లి తేలికగా గా పీల్చుకొంది. ఇంక రాధికకు పట్టరా సంతోషం. ఈనాటికి వారి కష్టాలు గట్టె క్కాయి. కష్టాలు కలకాలం ఉంటాయా కనిపెంచిన అమ్మ బాధ్యత, చెల్లెం

# జీవితం

బాధ్యత ఆమెమనస్ఫూర్తిగా వహించింది.

'ఈవిధంగానైనా తల్లిఋణం తీర్చుకోవచ్చు' అనుకుని సమాధానపడింది.

మొదటిరోజు రాముడికి నమస్కారం చేసి, "కొత్తవాతావరణానికి అనుగుణ్యంగా నడుచుకొనే గలిగే శక్తినియ్యి తండ్రీ" అని మొక్కుకొంది.

ఆ పెద్దస్కూలులో టైపిస్టుగా ఆమెకు బాగా సరిపడింది. సహృదయుంగల హెడ్మాష్టరు, మిగిలిన గుమాస్తాలు చాలమంచి వాళ్ళు. టీచర్స్ కూడా చాలసరదాగా ఉంటారు. చక్కని వాతావరణం. కుళ్ళు కిల్మషాలు, తగవులులేని ఇన్‌స్టిట్యూట్ అవటం వల్ల ఆమెకి చాల నచ్చింది. ఆ 'స్టాఫ్‌లో' ఆమె ఒకమంచి వ్యక్తిగా స్థానం నిర్పంచుకొంది. ఇదంతా దైవానుగ్రహం అనుకొని మనసులోనే దేవుడికి నమస్కరించుకొనేది. ఆమె జీవితంలో, ఇది మరొక మలుపు. ఆమెకు వచ్చే మాటపాతిక లోటే ఆపట్నంలో కాలక్షేపం చేయలేక దగ్గరగా ఉన్న పల్లెనుంచి వచ్చేది. ఉదయం ఏడుగంటలకు అదరా-బదరా భోజనం చేసి వెళ్ళి, సాయంత్రం ఆరుగంటలకు తిరిగి వచ్చేది. ఆ ప్రయాణంలో చాలభాగం కాలినడకే. ఆరోగ్యం సరిగా ఉన్నా లేక పోయినా ఈనడక తప్పేదికాదు. అయినా ఆమెముఖంలో విసుగు కోపం కనిపించేది కాదు. చిరునవ్వే ఆమె ఆభరణం. పూర్తిగా పద్దెనిమిది సంవత్సరాలు నిండకుండానే ఉద్యోగంలో అడుగు పెట్టటం. ఈవిధంగా జీవితం సాగుతోంది. అదే ఉద్యోగంలో అపల్లెలోనే వుంటున్న గిరిధర్ ఆమెకు నెమ్మదిగా పరిచయం మయ్యాడు. అతను ఎంతో ఉత్సాహంగా ఆమెతో కబుర్లు చెప్పేవాడు. ఆఫీసు విషయాలు ఇద్దరూ చర్చించుకునేవారు. వాళ్ళిద్దరిమధ్యా రహస్యాలు ఉండేవికావు. వాళ్ళిద్దరి గృహపరిస్థితులు ఒకేరకం అవటంవలన కావలసిన సలహాలు ఒకళ్ళకొకళ్ళు చెప్పుకొనేవారు. క్రమంగా రాధికతో చెప్పనిదే ఏపనిచేసే వాడుకాదు గిరి. చిన్న తనంలో రఘు మీద పెట్టుకొన్న ఆశలు అణగారిపోయాయి. కాని, యిప్పుడు రాధికకు కొత్త ఆశలు చిగురించాయి. అందుకే గిరిధర్ లేనిదే ఒక్కరోజు ఉండలేనను కొనేది ఆమె మనసు. అతను కూడా ఏ ఒక్కరోజు ఆమెకు కనిపించకుండా వుండలేకపోయేవాడు. ఆమెకు వ్యతిరేకంగా వాదించడం అతని మతం. ఆమె 'అవునంటే' 'కాదు' అని వాదించేవాడు. ఇద్దరూ వాదించుకొనే వారు. వారికి రాధిక తల్లి తీర్పుచెప్పేదాకా వూరుకొనేవారుకాదు. తల్లి, గిరిని సమర్థించినపుడు చిన్నపిల్లాడిలా అల్లరిచేసే వాడు. అతన్ని చూచి పగలబడినవ్వేది రాధిక. ఆమెతోపాటు ఆమెతల్లి కూడా పాలుపంచుకొనేది. రాధిక అతనిమీద ఎన్నో ఆశలు పెంచుకుంది. హృదయంవిప్పి చెప్పలేకపోయేది. అదే ఆమెలోని దుర్బలత. దూరాన ఉన్న అన్నయ్య ఎప్పుడైనా ఉత్తరం వ్రాసేవాడు. ఎప్పుడూ వచ్చేవాడు కాదు. పైగాదైవం అనుకూలిస్తే నీపెళ్ళికి వస్తా నంటూ వ్రాశాడు. ఆమె మనసులో ఏమీ అనుకోకుండా ఉంది. ఇప్పుడు కూడా అతను అవివాహితుడుగా ఉండటం ఆమె కిష్టం లేదు. అన్నయ్య పెళ్ళి చేసుకోవాలని అప్పచెల్లెళ్ళిద్దరూ కలలు కనేవారు. ఉత్తరాలు వ్రాయగా వ్రాయగా ఏదో ఒకసంబంధం తనే చూసుకొని నిశ్చయించుకొన్నాడు. పెళ్ళి నెలరోజులుందనగా వ్రాశాడు. అబ్బ! ఇంక రాధిక సంతోషం చెప్పక్కర లేదు. అందరూ, 'ఆడబొడుచుగే పెత్తనం లాంఛనాలు బాగా లాగుతుంది' అని అంటూంటే ఎంతో సరదా పడేది. ఆరోజు ఎప్పుడు వస్తుందా! అని ఎదురుచూసేది.

పెళ్ళిప్రయాణాన్ని వూహించుకుని అప్పచెల్లెళ్ళిద్దరూ కలలు కనేవారు.

"గిరిధర్, నీవుకూడా రావాలి సుమా!' అని అతన్ని ఆహ్వానిస్తే......

'నువ్వు పిలిచేదేమిటోయ్, నేనెలాగూ నీకంటే ముందే వెడతగా'' అంటాడు అతను.

అన్నయ్య పెళ్ళి గురించిన కలలు పూర్తవకమునుపే ''పోస్టు'' అంటో వచ్చాడు పోస్టుమాన్. అన్నయ్య దగ్గరనుంచి ఆవుత్తరం వెళ్ళి అందకోబోయింది. అంతలో అది గిరిధర్ చేతిలో పడిపోయింది. ఏడిపిస్తేనే గాని ఇవ్వడు. ఆమెకు కోపం తెప్పించటం అతనికి సరదా! పెళ్ళి ఆగి పోయిందని అందులో చూడగానే నీరు కారిపోయింది రాధిక.

'ఛీ! ఛీ! నాజీవితమంతా నిరాశే. ఏది అవాలని అనుకుంటానో అదే కాకుండా పోతుంది, అంటూ బాధ పడింది...

"నేను ఇన్సూరెన్సు కడుతున్నాను. నీవుకూడా కట్టు'' అంటూ వచ్చాడు గిరి.

'నాకక్కరలేదు ఆ యిన్సూరెన్సు ఎప్పుడో ఇరవై ఏళ్ళకి కదా!, ఈలోగా నేనుంటానో పూడతానో"

మాట పూర్తవకుండానే "నువ్వుచేయాల్సిందే' అన్నాడు ఎంతో అధికారంగా గిరి.

'ఏమిటబ్బా ఆ అథార్టీ..... కొంపదీసి నువ్వు ఏజంటువి కాదుకదా!'

'నేను ఏజంటు అయితేనేగాని నీవుకట్టవా? కట్టాల్సిందే'' అంటూ కడుతూ ఆమె చేత కట్టించాడు.

ఇలా ప్రతి చిన్న పెద్ద విషయాల్లోనూ ఇద్దరూ లతల్లా అల్లుకు పోతున్నారు. కాలం పరుగెడుతోంది.

ఒకరోజు - గిరిధర్ నవ్వుతూ వచ్చాడు. ఆనవ్వు ఏదో విశేషాన్ని తెలియపరచింది.

"గుడ్‌న్యూస్ మిస్ రాధాదేవీ!"

"ఏమిటా గుడ్‌న్యూస్...?" గిరి అంత తేలిగ్గా చెప్పడనుకున్నా, ఆత్రుతగా అడిగింది.

'మా మామయ్య ఈరోజే ఉత్తరం వ్రాశాడు......' అంటూండగానే..........

'మాఅమ్మాయిగారమ్మాయిని మా 'గిరి' కిచ్చి శ్రావణమాసంలో పెళ్ళి చేద్దామని ముహూర్తం పెట్టిస్తున్నానని వ్రాశాడు.' అంటూ ప్రవేశించింది గిరి తల్లి.

"నువు తప్పక రావాలిసుమా రాధికా.." నవ్వుతూ రాధవైపు చూచాడు గిరి.

రాధ అక్కడనుంచి లేకపోయింది. భూమిలోకి దిగి పోతున్నట్లనిపించింది. తనబాధని వాళ్ళు గ్రహిస్తారేమోనని శమాయించుకునేందుకు ప్రయత్నించింది. నవ్వు నటించి సంతోషాన్ని ప్రకటించింది. అక్కడనుంచి వెళ్ళిపోయింది.

మంచంమీద పడి భోరున ఏడ్చింది.

'ఏమిటి ఈ జీవితం? రెండో ఆశకూడా కూలిపోయింది. మనసుకి అంతదగ్గరగా వచ్చి, పైగా 'నాకుపెళ్ళి' అని సంతోషంగా చెప్తున్నాడు. అతని ఉద్దేశమేమిటి? నన్ను పెళ్ళి చేసుకొనే ఉద్దేశమే అతనిలో లేదా ? ఏం మగవాళ్ళు? హృదయంతో ఆడుకుంటారు, మనసుతో పరాచికాలాడతారు, అవి నలిగిపోతుంటే చూస్తూ ఆనందిస్తారు! తనకా ఉద్దేశమే లేనప్పుడు ఎందుకు నాకు దగ్గరగా రావాలి? కవ్వించాలి. నన్ను చూడకపోతే వుండనే లేనంటాడు. ఛీ, వీళ్ళ మనసులే యింత. మగవాళ్ళని నమ్మకూడదు. అయినా నాదే తప్పు, నేనొట్టి పిచ్చి మొద్దుని. పిచ్చిపిచ్చిగా ఆశించాను, అతను నాతో చెప్పలేదుగా నన్ను పెళ్ళిచేసుకుంటానని? కాలగమనం ఆగి పోతే బాగుండును.

(45వ పేజీ చూడండి)

# గ్లోరియా స్టువార్ట్
# కమ్యూనిస్టు చైనాలో నా అనుభవాలు-2



పార్టీ ఉదేశ ప్రకారం ముగ్గురు పిల్లలకన్నా ఎక్కువ తనకి కలుగరాదని నిశ్చయించుకున్న ఒక చైనా గృహిణి శీహెూపింగ్, పిల్లలు, అత్తగారు.

నేను చైనాలో ఉన్నంతకాలం మావ్ సెటుంగ్ అంటే ప్రజలకి ఎందుకు అంత ఇష్టం అని ఆలోచించి చూశాను.

చైనాలో విప్లవం వచ్చి ఇప్పటికి 16 సంవత్సరాలు దాటింది — వేడి తగ్గి ఉంటుంది! మావ్ కూడా నాలుగు సంవత్సరాలుగా తన 'కీర్తి'ని కొద్ది కొద్దిగా కోల్పోతున్నాడు.

మరి దీని రహస్యం ఏమిటి? ఒకనాడు హఠాత్తుగా ఒక యోచన వచ్చింది. చైనాలోని ఆడవారికి మావ్ అంటే విపరీతమయిన అభిమానం.

అంటే అతనొక మహ్మదుడని కాదు, ప్రజలందరికీ తల నెరిసిన తండ్రిలాగ కనిపించే వాడూకాదు.

కాని, చైనా స్త్రీలని వారి చెరసాల నుంచి విడిపించాడు. అంతకి ముందు వారిని సంతలో గొడ్లలాగ చూసేవారని ఒక పాత చైనా సామెతే చెబుతుంది.

పెళ్ళిళ్ళు పెద్దవారే కుదిర్చేవారు. ఎందరో భర్తలు పెళ్ళికాకముందు తమ భార్యలని చూసి ఉండరేమో. కట్నా బాధని గురించి చెప్పనే అక్కర లేదు.

బాగా బీద కుటుంబాలలో ఆడపిల్ల వడుపు వృత్తిలోకి పంపి డబ్బు సంపాదించే పద్ధతులు ఉండేవి.

అదృష్టంకల ఆడపిల్లలయితే పడువృత్తి స్వీకరించిన తర్వాత కూడా ఏ ధ కుడి ఉంపుడు కత్తెగానో కొంచెం సుఖ వారు. తక్కిన వారి సంగతి సరేసరి.

మరి కొందరు తమ పిల్లల్ని అమ్మేక వారు— మునసబువారికీ, ఇంట్లో బానిస కావలసిన వారికీ.

మావ్ ఈ పరిస్థితులని మార్చేశ న్నాడు. స్త్రీలకి అతనంటే గౌరవ ఉండదూ?

మావ్ చైనా స్త్రీలకి చేసిన ఉపకా లలో ముఖ్యమయినది మరొకటి ఉం సాధారణంగా ఒకామెకి ఆరుగురు, ఏడుగు పిల్లలు కలిగేవారు. మావ్ 195 ప్రాంతాలలో ఈ పరిస్థితిని కొంత మార్చాడు. 'పార్టీ' ఒక ప్రకటన చేసిం ముగ్గురు పిల్లల పయిన ఉన్నవారు సం విరోధులన్నది! ఈ ప్రకటనని విశేష ప్రచారంలోకి తెచ్చింది.

"కామేడ్! స్వదేశం గురించి ఆలోచిం ని సుఖమే ప్రధానం కాదు! పిల్లలు పుట్ట తగ్గాలి!" అనే నినాదాన్ని అన్ని చోట వినిపించారు.

అయితే, ఈ విధానానికి ఒక అడ్డ వచ్చింది. చైనాలో కుటుంబనియంత్ర పద్ధతులు అభివృద్ధి కాలేదు. మరి ఎల నేను కొన్ని 'విచారణ'లు జరపగా తెలిసి ఏమిటంటే, ఒక స్త్రీకి పిల్లలు పు దోషం ఆమె భర్తకే అంటగట్టేవా స్థానిక 'కమిటీ' వారు అతన్నే నేరస్థుడికి పరిగణించేవారు. ఇక— ఒక విద్యార్థి వా అన్నట్లు — "నిగ్రహమే" దీనికి మం పెళ్ళయినంత వరకూ వ్యాయామం, వి భ్యాసం, రాజకీయాలు— వీటిలో ము పోయి కోరికలని మరిచి పోవటమే గ తరం అనేవారు.

ఈ కారణం చేత దేశాన్ని వదిలి పోయిన మగవారిని హాంకాంగ్‌లో చూశా



మావో ట్సేటుంగ్ చైనా నాయకులలో అద్భుత పురుషుడు. ఈ బొమ్మ గ్లోరియా స్టువార్ట్ ఒక కాలేజి ప్రాంగణంలో తీసింది.

# కమ్యూనిస్టు చైనాలో నా అనుభవాలు

లీచెన్ (33 సంవత్సరాలు) అనే అతను నాతో ఇలా అన్నాడు "నా భార్యకి నలుగురు పిల్లలు కలిగారు. మూడు సంఖ్య దాటినందుకు నన్ను ఖండించారు. నేను మంచి కమ్యూనిస్టుని కాదని నన్ను తిట్టారు నా తోటి కార్మికులు.

"ఇంకా పిల్లలు పుట్టడం మొదలు పెడితే నాగతి ఏంకాను? హాంకాంగ్ పారిపోయి వచ్చేశాను. ఇక్కడ ఆడపిల్లలు కంటికి ఎంత ఇంపుగా ఉన్నారు!"

కామశాస్త్రానికి సంబంధించిన పుస్తకాలని చైనాలో నిషేధించారు. ఉన్న వాటిని గ్రంథాలయాలలో దాచేశారు. అవి పండితులకి మాత్రమే అందుబాటులో ఉంటాయి.

చైనాలో బహిరంగ ప్రదేశాలలో ప్రేమికులు తమ ప్రణయాన్ని వెలిబుచ్చటం చాలా అరుదు— అసలు లేనే లేదేమో. సినిమా చీకటిలో కూడా యువతీయువకులు చేతులు కలుపుకొనటం నేను చూడలేదు. (ఒక రోజు ప్రత్యేకంగా పనికట్టుకుని సినిమా హాలుకి వెళ్ళి నాచుట్టు పక్కల వారందరినీ దొంగతనంగా కలయ చూశాను!)

చైనావారికి చుంబనం అంటే అసహ్యం. అది అశుభ్రమయిన దురలవాటు అనుకుంటారు.

చైనా సమాజంలో కామానికి బహిరంగంగా, ప్రాముఖ్యత ఇవ్వరు. (హాంకాంగ్‌లో ఆడ పిల్లల వస్త్రధారణ దీనికి పూర్తిగా వ్యతిరేకం.) వీలయినంత దాకా నిరాడంబర వస్త్రధారణ చేస్తారు అక్కడి ఆడవారు. తెల్ల చొక్కాలు, నల్లటి పావడలు, వదులు లాగూలు వారి 'స్త్రీత్వా'నికి ప్రచారం అవ్వవు.

సినిమా, టెలివిషన్‌లలో కామానికి సంబంధించిన విషయాలని రానివ్వరు.

ఆడపిల్లలు అలంకరణ కోసం రోజుకి గంటకన్నా కేటాయించరాదని పార్టీ ఉత్తరువు, వీలయితే పుస్తకాలు— అందులోనూ మావో రచనలు—చదవమని ఆదేశం.

లీహోపింగ్ 20 సంవత్సరాల గృహిణి. ఆమెకి ముగ్గురు పిల్లలు. ఇక పుట్టనివ్వనని శపథంపట్టింది. ఆమె షాపులో పని చేస్తుంది. ముసలి అత్తగారు ఇల్లు చూసుకుంటుంది. ఆవిడ లేకపోతే పిల్లలని నర్సరీ స్కూలికి పంపుతారు. లీహో పార్టీ సభ్యురాళ్ళలో ఆదరణీయురాలికింద లెక్క.

భర్త లీ హాయి— చున్ (28సం.) 'రవాణా— పడవ' నడుపుతాడు. షుంచున్ నది వెంట ప్రయాణాలతో అతనికి తీరికే ఉండదు. వారి సంసారం చాలా పొదుపుగా నడవాలి. జాగ్రత్తగా భోజనం చేస్తారు. ఒక సైకిలు ఉంది. ఇదే వారి నిధి.

కాని, చైనాలో ఇటీవల సాధించిన అభివృద్ధి వారందరికీ లాభదాయకమనే చెప్పారు. కొన్ని సంవత్సరాల క్రితం పడవలో నివాసం కలవారికి నేడు మూడు గదుల వాటా ఉంది. ఈ వాటాలో సామాను చాలా తక్కువ కాని నీళ్ళగది, పాయిఖానా ఉన్నాయి. పాత నివాసంతో పోలిస్తే ఇది స్వర్గసీమ.

నీటి పారుదల పథకాలతో దేశంలోని వరద బాధని తగ్గించు కున్నారు ప్రజలు. దీనికి అందరూ సహకరించారు. ఇంకా సహకరిస్తున్నారు. స్వయం కృషి లేకపోతే బాధలు అధిక మవుతాయని అందరికీ తెలుసు.

ఉదాహరణకి — ఆదివారాలలో పొరుగూళ్ళలో చుట్టాలని చూడటానికి వెళ్ళేవారు చాలా మంది దారిలో ఆగి ఏదో కాల్వ తవ్వటానికో, గట్టు వెయ్యటానికో తోడ్పడుతూ ఉంటారు.

'లీ' దంపతులు నెలకి ఒకటి— లేక రెండు సార్లు — సినిమాకి వెడతారు. ప్రస్తుతం వారి ధ్యేయం ఒక ట్రాన్సిస్టర్ రేడియో.

పాతకాలంలో ఒక ఇంటికి 30, 40 మంది ఉండేవారు. వీరందరికీ అధిపతి ఒక పెద్దాయన. పెత్తనం అంతా అతనిదే. నేడు ఒక ఇంట్లో 11,12 మందికి మించి ఉండటం అరుదు. అందరూ ఉద్యోగాలు చెయ్యవచ్చు.

అందరూ కార్యదీక్ష కలవారుగా కనిపిస్తారు. సాంఘిక కట్టుదిట్టాలని అతిక్రమించేవారు నాకు ఇదికంగా కనిపించలేదు.

కాని— కొందరు పార్టీ పెద్దలు, అధికారులు విలాసాలని పూర్తిగా వదులుకోలేదని తెలుసుకున్నాను! అవసరం వచ్చినప్పుడు పోర్చుగీసు ప్రాంతం అయిన 'మాకావ్'కి రహస్యంగా వెళ్ళి వస్తూ ఉంటారు. నిజానికి అంత రహస్యమూ అవసరం లేదనే అనాలి. బస్సు ఎక్కితే చాలు!

మాకావ్ లో మద్యం మొదలయినవాటికి కొదువ లేదు. నాకు తెలిసిన ఒక పార్టీ నాయకుడికి అక్కడ ఒక ఉంపుడుకత్తె ఉంది. నెలకి రెండు సార్లు ఆమెని చూసి వస్తూ ఉంటాడు.

'చైనా కవచం'లో నిర్భేద్య మయిన స్థానం లేదనుకున్న నాకు ఇవి కొంచెం తెరిపి కలిగించాయి! వీరు యంత్రాలు కాదు, మానవమాత్రులే అనిపించింది.

(సశేషం)




### జరిగిన కథ

మగధరాజు బింబిసారునకు ఆమ్రపాలిని చేపట్టాలనే ఉద్దేశ్యంతో వైశాలికి వస్తాడు. పాలి భవనంలో ప్రవేశించి ఆమెని ఆకర్షిస్తాడు. పాలికి బింబిసారునిపై ప్రేమ జనిస్తుంది. మహానాముడు ప్రవేశ వృత్తాంతానుసరించి పాలిని దేశన్న్తికిని చేస్తాడు. బింబిసారుని వివాహం చేసుకున్న పాలికి తన తండ్రి నిర్ణయం తెలిసి మరణశయ్యమీదఉన్న మహానాముని చెంతకు వస్తుంది. మహానాముడు మరణిస్తాడు. చేలన బింబిసారుల వివాహమైపోయింది. యుద్ధానికి సన్నద్ధులైన లిచ్ఛవీయుల్ని పాలి శాంతింపజేసింది. చేలన, సంజయుడూ పాలిని అనుగ్రహించమని బింబిసారుని కోరారు, బింబిసారుడు పాలి దర్శనానికి వస్తాడు. పాలి పాటకరాజు నగరం విడిచి వెళ్ళిపోయింది. పదహారేళ్ళ క్రితం తననుండి వేరైన పుత్రునికోసం పాలి ఆవేదన ఎక్కువైంది. పాలి ధర్మసభకు వెళ్ళింది, వస్తారుడి దగ్గరకు వెళ్ళి అడిగింది బుద్ధుని చూసినప్పుడు ఆమెలో ఒక వింత ప్రశాంతత ఏర్పడింది.

## 25

—'సునేత్రా'.

సునేత్ర ఒగరుస్తూ ఆమె దగ్గరకు వచ్చి నిల్చుంది. ఆమె ఇప్పుడే వెలపల నుండి వచ్చింది.

'ఏమి, ఎక్కడ తిరగడానికిపోయావు?'

సునేత్ర ఊరుకుంది.

'చెప్పు, మూఢురాలా.'

'అమ్మా, నేను బౌద్ధ భిక్షువుల గుడారానికి వెళ్ళాను.'

'ఎందుకు?'

'ఊరక, చూడ్డానికి. కాని ఏమీ లభించలేదు.'

సునేత్ర సంకేతం విమలుని చూడ్డానికి వెళ్ళిన విషయానికి సంబంధించినదని పాలి గ్రహించింది. ఆమె ముందేమీ అడగలేకపోయింది. అలాటి పాలి కోపానికి అలవాటుపడిన సునేత్ర మెల్లగా స్వామిని భూషణాలు తొలగింప సాగింది.

'అమ్మా, గౌతమబుద్ధుడు అద్భుతమైన వాడనీ, దేవరూపుడనీ అందరూ అనుకుంటున్నారు....'

సునేత్ర చెంపమీద ఒక్క పెట్టు పెట్టాలని పాలికి కోరిక కలిగింది. కాని ఆమె మౌనంగానే ఉంది. సునేత్ర చెప్పసాగింది—

'ఇంకా అమ్మా, ఆయన చమత్కారాల విషయం ఏమని చెప్పను? ఆయన్ని చూడగానే పాటికపుత్రుడు నేలనంటుకు పోయాడనీ, నాలుక పొట్టలోకి దిగి పోయిందనీ యజమాను లంటున్నారు.... కాని ఆయన శిష్యులు సామాన్యులు కారు. వారు బుద్ధుని వెంబడించి, శ్రమణ గౌతముడా, నీ ధర్మం మూర్ఖులకు, అంధ విశ్వాసం కలవాళ్ళకి తగింది. నీవు సత్యమైన వాడవయితే, బుద్ధుడ వయితే, సంపూర్ణమైన బుద్ధి కలవాడవయితే మాకేదైనా చమత్కారం చూపించు' అని అనసాగారు.

పాలి వింటూ ఉంది.

'అమ్మా, గౌతముడు ఆ ప్రజలతో అన్నాడు — 'మీ పాటికపుత్రుని ఇక్కడికి తీసుకొని రండి, అప్పుడు చూపిస్తాను'..... కాని వారు వెళ్ళుచుండగ వారి నాపి, ఒక మాట విని పొండి అన్నాడు— 'మీ పాటిక పుత్రుని యందు ఎప్పటివరకు చెడు ఊహ యుంటే అతని మస్తిష్కం పగిలిపోతుంది. ఇది విని పాటికపుత్రు లందరూ శంకితులై అక్కడనే నిల్చిపోయారు. కొందరీ విషయం పాటిక పుత్రునికి చెప్పారు. కాని అతడు తన స్థానంలోనిలవలేనంతగా భయపడ్డాడు....'

పాలి వింటోంది. వాచాల అయిన సునేత్ర చెప్తోంది— 'అమ్మా, ఎక్కువ అరుచి కలిగినా, అంధవిశ్వాసం గలవాళ్ళ మనస్సులందు విశ్వాసం కలిగించడానికి గౌతమ బుద్ధుడు ఆ పాటికపుత్రుల యెదుట ఏడు తాళ్ళ ఎత్తున ఆకాశమం దెగిరాడు. అంతే పొడుగైన జ్వాలను ఉత్పన్నంచేసి అందులో అదృశ్యమై పోయాడు. అమ్మా, అప్పుడే పాటిక పుత్రులందరూ భిక్షు సంఘాన్ని శరణు జొచ్చారు. వారు బౌద్ధ ధర్మదీక్ష తీసుకున్నారు.'

పాలి అంది — 'అంటే, నేనూ దీక్ష తీసుకోనా? నాకు గౌతమ తథాగతుని మీద విశ్వాసం లేదు. అతడు ఇంద్రజాలికుడు, మాంత్రికుడు, వశీకరణంచేయువాడు.'

పాలి హఠాత్తుగా ఆగి పోయింది. ఆమె చాలా వ్యాకుల పడుతోంది. ఆమె సునేత్ర వైపు చూసి 'నీ వతన్ని చూశావా?' అని ప్రశ్నించింది.

'చూశానమ్మా, అతడు జ్వాలను చేస్తుండగా నేను చూశాను. తథాగతుడు సర్వశ్రేష్ఠుడు, దయామయుడు....'

'దయామయుడా?'

'అవునమ్మా, దయామయుడు, స్నేహమయుడు, కల్యాణమయుడు....'

'దయామయుడా?' అని పాలి పెదవుల నుండిఅస్పష్ట శబ్దం వెలువడింది.

సంధ్యా సమయంలో పాలి మహోద్యానానికి వచ్చినప్పుడు బౌద్ధభిక్షువుల గుడారం చెంత సింహ లిచ్ఛవీయు డొంటరిగ కన్నీరు కారుస్తూ నిల్చున్నాడు. తథాగత బుద్ధుడు కొంతసేపటికి ముందే తన శిష్యమండలితో సాకేతం వైపు బయలుదేరిపోయాడు. మహాపరాక్రమశాలి అయిన సింహుడు ఆయన వియోగానికి బాధపడి బాలుని లాగ విలపిస్తున్నాడు. అతని దృష్టి తథాగతుడు పోయిన దారి వైపుంది. పాలి అతని కత్యంత సమీపంగా పోయి నిలబడి శ్రద్ధ దగ్గర నిరాశలా ఉంది.

'దేనిని గురించి యోచిస్తున్నావు, సింహా రాజా?' అని పాలి మెల్లగా అడిగింది.

'ఈ సారి తథాగతుడు తన వర్షావాసాన్ని లిచ్ఛవీయుల మధ్య గడిపినట్లయితే...'

'నీ సర్వమూ ఆయన పాదాల దగ్గర ఉంచాలి, ఇదేనా?'

'అవును, ఇదే మహదాకాంక్ష.'

'అయితే, తథాగతుని పిలవడానికి నీవు వెళ్ళెదవా?

'ఇదే కోరుతున్నాను.'

'ఆయన భిక్షువుల నందరిని కూడ...?' పాలి ఆశాపూరిత స్వరంతో ప్రశ్నించింది.

'ఇదే కాంక్ష. లేనిచో ఎందరు భిక్షువులు రాగలిగిన అంత మంచిది. అతని భిక్షుమండలి చిన్నదికాదు. మార్యుడు క్రమంగా

ప్రకాశవంతుడగునట్లు తథాగతుని తేజస్సు కూడా క్రమంగా సంసారుల హృదయాన్ని ప్రకాశవంతంగా చేస్తోంది. నేడు వేలుకాదు, లక్షల కొలదీ శిష్యులు అతని ఆజ్ఞ కోసం సిద్ధంగా ఉన్నారు.'

'అయితే, మన మిద్దరం కలిసి ఆహ్వానిస్తే శిష్యులందరూ తప్పక రాగలరు.'

'అలాగే కావాలి..' అని పాలి అంది. ఆమె ఇంకేమీ అధికంగా చెప్పలేకపోయింది. ఆమె పైకి చూసింది. ఆమ్రవృక్షం మీద ఒక సన్నని కొమ్మపై కోయిల కూస్తోంది. పాలి చెట్టు క్రింద అరుగు మీద కూర్చుండి ఉంది. దానిని గంభీరంగా చూస్తోంది... ఒకనాడు, తొలిసారిగా ఆమె ఇక్కడి నుండే లోకాన్ని చూసింది. నేడు ఆమె ప్రపంచాన్ని అర్థం చేసుకుంది.

ఏడు దినాలయినాక వైశాలి వార్షిక మహోత్సవదినమునందు, ఆ చెట్టునకు సమీపమందే వజ్జిగణములు, వైశాలిలోని లిచ్ఛవీయ గణములు పాలి రాక కోసం ప్రతీక్షిస్తూ కూర్చున్నారు. అప్పుడు పాలి స్థానంలో సునేత్ర నృత్య మారంభించింది.

పాలి దేశసర్తకి అయ్యాక ఇక్కడికి రాకుండా ఉండడానికి ఇదే మొదటిసారి.

పాలిలో ఏదో విచిత్ర పరివర్తనం కలిగిన దన్న విషయం ఆనాడే వైశాలిలో వ్యాపించింది.

దినములు గడవసాగాయి. సమయం గడుస్తున్న కొద్దీ పాలి దర్శనం తగ్గసాగింది.

నెలలు గడవసాగాయి. పాలి నగరానికి రావడం, పోవడం పూర్తిగా తగ్గిపోయింది.

ఏళ్ళు గడవసాగాయి. సంథాగారంలో లిచ్ఛవీయుల వార్షిక పరిషత్తులో తప్ప నృత్యం చేయడమే పాలి కసంభవమైపోయింది. విలాసులైన ధనికులు, రాజులు గుంపుల కొద్దీ పాలిని చూడ్డానికి ఉవ్విళ్లూరుతున్నారు.

పాలి మాయా మమతలు విడిచి వేసింది. దేశానికి ఎటువంటి సేవ అయినా చేయడానికి తత్పర అయిన ఆ పాలే ఇప్పుడు లిచ్ఛవీయ పరిషత్తు తప్ప ఇతర విషయము నందు ఆనందం పొందడంలేదు.

ప్రతిసంవత్సరం వైశాలిలో పూర్ణిమనాడు అగుంతుక భిక్షువుల సంఖ్య వృద్ధి అవుతోంది. ప్రతిసంవత్సరం పాలి తన రోషాన్ని ఉపశమింప జేయడానికి భిక్షువుల వద్దకు వెళ్ళి, వారి సదాచారాల ప్రభావం పొంది దినముల తరబడి భిక్షువుల సహవాసంలో ఉండ సాగింది. కాని ఆమెకు విముక్తి లభించలేదు.

పెక్కు సంవత్సరాలు గడిచినా, పాలి ఆశ అడుగంటలేదు. వైశాలిలో సగం భాగం ఇప్పుడు గౌతముని మన్నింపసాగింది. క్రమంగా వైశాలిలో ఇతర ధర్మప్రవక్తలు, అనుయాయులు లోపింపసాగారు. అయినా, సంథాగారం ఎప్పటివలె ఉంది. ప్రవేణి పుస్తకంలోని ఆదేశాలలోనూ, లిచ్ఛవీయ గణతంత్రమందూ ఎట్టి మార్పూ జరగలేదు. సరిగ పది సంవత్సరాల తర్వాత పాలి బుద్ధుని అనుయాయిని అయింది.

తథాగత బుద్ధుడు వైశాలికి వచ్చి యున్నారన్న విషయం నేడు సూర్యోదయం కాగానే వ్యాపించింది. పాలి వెంటనే అందమైన గుర్రములు గల రథం సిద్ధం చేయించింది. అందరి కంటె ముందు కూటా



గారానికి పోయింది. తథాగతుని ఆశీర్వాదం పొందాక ఆమె చాల వినయంతో ఆయనను భిక్షుక సంఘంతోపాటు భోజనాని కాహ్వానించింది. సమదృష్టితో పాటు తథాగతుడు మానసికశాస్త్రం కూడా ఎరుగును. అతడు పాలి శ్రద్ధను చూసి ప్రసన్నతతో ఆమె ఆహ్వానం అంగీకరించాడు.

ఒక జాము తరవాతనే వైశాలి అంతటా కోలాహలం వ్యాపించింది. బుద్ధానుయాయు లయిన పెక్కుమంది శ్రేష్ఠులు, మహా జ్యోతిషకగణము పాలి గృహానికి పరుగెత్తారు. తథాగతు డక్కడ ఒక్కరోజు మాత్రమే ఉంటాడు. దాదాపు ముఖ్య శిష్యగణమంతా ఆయన వెంట ఉంటుంది. సింహ లిచ్ఛవీయుడు అటువంటి సదవకాశాన్ని పోగొట్టు కొనగోరలేదు. అన్య శ్రేష్ఠుల కంటె అతని వాంఛ అధికమైంది. తథాగతుని భోజనానికి తప్పాహ్వానింపనిమ్మని అతడు పాలి నెంతో వినయపూర్వకంగా ప్రార్థించాడు. పాలి కోరిన ధనం ఇవ్వడానికతడు సిద్ధంగా ఉన్నాడు. నేడు, చాలాకాలం తరువాత, వైశాలి లోని గణింపదగ్గ నాగరికులందరూ అకస్మాత్తుగా పాలి ప్రాసాదంలో గుంపుగూడారు. కాని, పాలి కొంచమైనా లొంగలేదు. ఆమె ఎప్పుడూ అజితగా ఉంది. నేడు తథాగతుని, అతని శిష్యులను ఆహ్వానించడంలో అందరిపురుషులలో ఆమెదే గెలుపు.

మరునాడు నియమిత సమయానికి తథాగతుడు తన శిష్యులతో కూడవచ్చాడు. పాలి హృదయం ఆశా ఆనంద డోలికలో వూగుతోంది. ఆమె స్వాదిష్ట ఖాద్యాలతో భోజనం, భిక్షువుల కివ్వడానికి వస్త్రములు సిద్ధంగా ఉంచింది.

పాలి ఉల్లాసంతో స్వహస్తాలతో భిక్షువులకు వడ్డించి వారికి సంతృప్తి కలిగించింది.

భోజనమైన తర్వాత తథాగతుడు నియమానుసారం పాలికి, ఆమంత్రితులగు నాగరికులకు మొదట దానకథను, తరవాత శీలకథను, ఇంకా ఇతర కథలూ చెప్పాడు. అందరికి సంతోషం, ప్రోత్సాహం చైతన్యం కలిగించి తన నివాసానికి వెళ్ళాడు.

పాలి ఎంత ప్రసన్నం కలిగిఉందో అంత నిరాశకూడా పొందింది. ఆమెకు విమలు డెక్కడా కన్పించలేదు. ఆమె విమలుని కలుసుకొను కోరికను అతి గుప్తంగా ఉంచింది.

రెండవ సంవత్సరం పాలి తన ప్రాసాదంలో నాలుగింట మూడు వంతుల భాగం వేరుపరచి అక్కడ బౌద్ధ భిక్షువులకు ఒక మఠం కట్టించింది.

మఠం పూర్తిగా తయారయ్యాక ఒకనాడు పాలి రాజగృహం వేపు బయలుదేరింది. ఇరవై సంవత్సరాలకి ముందు ఆమె ఎప్పుడూ ఈ మార్గంలోనే పోతూండేది. నేడు ఈ మార్గంలో రథం మీద కూర్చుని పాలి ఇదే ఆలోచిస్తోంది. చాలా కాలం తరవాత ఆమె గుర్రపుకళ్ళెం చేతిలోకి తీసుకుంది. ఈ సమయంలో ఆమెకు కిశోరావస్థలోని ఉత్సాహం, ఆవేగం అనుభూత మవుతున్నాయి. రాజగృహ ప్రాంతానికి వచ్చినప్పుడు పాలి రథ మాపింది. మరునాడు ఉదయమే తథాగతుడు భిక్షకి నగరానికి వచ్చినప్పుడు పాలి అతని చరణాలు పట్టుకుంది. ఎక్కువ కోరికతో ఆమె శిష్య మండలితో కూడ తన యింటికి రమ్మని తథాగతుణ్ణి ప్రార్థించింది— 'భగవాన్, ప్రపంచంలో ఎక్కువ కాలం ఉండనని నాకనిపిస్తోంది. నాకు పుత్రులు గాని, పుత్రికలుగాని, ఎవరూ లేరు. నేను నా ప్రాసాదం మీకు అర్పించడానికి వచ్చాను. మీరు దీనిని స్వీకరించండి.' తథాగతుడు శాంతంతో ఆమె కోరికను మన్నించాడు. పాలి ఆనందాశ్రువులు తుడుచుకొంది. తథాగతుడు శిష్యులతో వెళ్ళిన కొంత సేపటి వరకూ ఆమె పరాయి దేశంలో కూర్చుంది. జీవితములో మొదటిసారి నేడు ఆమె మాగధీయుల భూమి మీద కాలు పెట్టింది. ఆమె కళ్ళు మూతపడ్డాయి. హృదయంతో రమించిన పుత్రుని, ఆ పుత్రుని తండ్రిని స్మరిస్తూ ఆమె కూర్చుంది. ఇది ఆమె స్వామిని కావలసిన భూమి. ఆమె హృదయధనం రాజ్యము చేస్తూన్న భూమి కూడా ఇదే, ఆమె జీవితాన్ని ఆశానిరాశల వూయలలో వూపి ఆమె పుత్రుడు గ్రామములలో నడాడు భూమి కూడా ఇదే, ఆమెకు శాంతం ప్రసాదించిన తథాగతుడు విహరించు భూమీ ఇదే. భూతకాల స్మృతి ఒక్కసారి మేల్కొంది. భూతకాల దృశ్యాలు కళ్ళ ముందు తళతళలాడ సాగాయి. ఆమె నవ్వింది, విలపించింది. మళ్ళీ నవ్వింది, దీర్ఘంగా నిట్టూర్చి వైశాలి వైపు బయలుదేరింది.

ఒక వారం తరవాత వైశాలి నివాసులు ఆశ్చర్యచకితులయ్యారు. ఎందుకనగా, పాలి భిక్షువుల నందరినీ ఆహ్వానించింది. దూర దేశాల భిక్షుగణం కూడా వైశాలిలో గుంపు కూడ నున్నారు. చాల సంవత్సరాలకు తరవాత నేడు మళ్ళీ పాలి పేరు ఇంటింటా చెప్పుకొనబడసాగింది. నిశ్చిత దినం తథాగతుడు తన భిక్షువులతో కూడా వైశాలిలో ప్రవేశించాడు. వైశాలి అంతా ఆయన దర్శనానికి విజృంభించింది.

ఆ రాత్రి పాలి స్వహస్తాలతో భోజనం తయారు చేసింది. ఉదయం తథాగతుడు తన శిష్యసంఘంతో కూడా పాలి యింటికి వచ్చాడు. పాలి స్వాగత మిచ్చింది. నేడామె ఒక క్రొత్త విషయం చూసింది. తథాగతునితో భిక్షువులు ఉండనే ఉన్నారు. కాని, ఈసారి ఆయనతో కూడ భిక్షుణిలు కూడా ఉన్నారు. ఇప్పటికి మహాప్రజాపతి గౌతమి పాలనలో భిక్షుణీ సంఘం స్థాపింప బడింది. పాలి వారికి స్వాగతం చెప్పి, వారి భోజనం కూడ తయారు చేసింది. పాలి తన చేతితో ఉత్కృష్ట ఖాద్యం వడ్డించడానికి వెళ్ళింది. ఆమె ప్రతి భిక్షుకుని, భిక్షుణిని జాగ్రత్తగా చూసి ఉంచుతూ పోతోంది. ఆమె ముందుకు పోతూన్న కొద్దీ హృదయంలో ఉత్సాహమూ, ఆశానిరాశల విశ్రిత స్పందనం కలుగుతున్నాయి. క్రమంగా నిరాశ పెరుగుతూ పోయింది. ఆగంతుకులలో విమలుడు కన్పించలేదు. పాలి యత్నించింది కాని కన్నీరు ఆగలేక పోయింది.

తన హృదయ వ్యథను కల్యాణమూర్తి తథాగతుడు ఏమైనా తెలుసుకున్నాడేమో! తను విషయం గురించి పాలి ఒక్కమాటైనా ఇంతవరకు యోచించి ఉండలేదు. ఇప్పుడు పాలి ఆఖరి పంక్తికి వడ్డించ నారంభించింది. ఒకరిద్దరి తరువాత మూడవ భిక్షకునిపై ఆమె దృష్టి పడగానే అకస్మాత్తుగా ఆమె చేతి పాత్రలోని ఒకభాగం జారిపోయింది. ఎదుట కూర్చున్న భిక్షకుడు తక్షణం దాన్ని పట్టుకుని ఉండక పోతే, పాత్రలోని ఖాద్యాన్నమంతా ఇటు అటు పడి ఉండేది. పాత్ర పట్టుకొన్న భిక్షకుడు విమలుడు.

పాలి మూఢురాలులా చూస్తోంది. ఏదో అపూర్వ భావంచేత ఆమె కళ్ళు మెరిశాయి. విమలుని ఆ గాంభీర్యంపోయి, అతని ముఖం మృదువైన మందహాసంతో వికసించింది.

కళ్ళు మృదుత్వంతో హాసించారు. ఈ శ్రమణుడు అర్హతను పొందాడు. ఇప్పుడు అతడు స్థవిరుడు. సంవత్సరాల పాటు అదృశ్యుడై ఉన్న తరవాత అతనికి జ్ఞానం ప్రాప్తించింది. తథాగతుడు దూరం నుండి మాతాపుత్రుల్ని చూస్తున్నాడు. విమలుడు క్షీరపాత్ర పట్టుకొని పాలి చేతిలో ఉంచాడు. పాలి మళ్లీ వడ్డింప సాగింది. వడ్డించిన పిదప ఆమె తిన్నగా తన భవనానికి వెళ్లింది. సునేత్ర కూడా ఆమె వెనుక వెళ్లింది. పాలి శయ్యమీద పడుకుంది. సునేత్ర ఆమె శిరము నొక్కుతూ అంది— 'అమ్మా..' పాలి ఉలికిపడి పైకి చూసింది. సునేత్ర విలపిస్తోంది.

మర్నాడు సూర్యోదయం కాగానే విమలుడు పాలి ప్రాసాదాని కెదురుగా వచ్చి నిల్చుంది. అతడు పిలవకుండానే ప్రాసాదంలో ప్రవేశించాడు. పాలి కంగారు పడిన దానిలా అతని దగ్గరకు పరుగెత్తి వచ్చింది. విమలు డామెను శాంతింపజేశాడు.

'దేవీ, నడు, వేళయింది.'

పాలి స్తబ్ధయై రెప్ప వాల్చకుండ చూచిన తర్వాత అంది—

'ఎక్కడకు?'

'ప్రపంచానికి దూరంగా.'

'ఎక్కడికి?'

'నిర్వాణపథం వైపుకి.'

'నిర్వాణమా?'

'అమ్మా, నీకు నాతో రావాలను కోరిక ఉందికదా?'

'అమ్మా?..... స్థవిరా, ఇన్ని సంవత్సరాలయ్యాక, నేనే మాట వినడానికి గిలగిల కొట్టుకొని దినాలు, రాత్రులు, నెలలు, ఎన్నో సంవత్సరాలూ గడిపానో, నేడా మాటనే విన్నాను. కాని, దీన్ని వినకుండా ఉంటేనే బాగుండుననిపిస్తోంది. నాకు ప్రపంచంలో ఉన్న ఏ వస్తువు మీదా రుచి లేదు. నిన్నిప్పుడు చూసి నేను జీవించి ఉన్నట్లు స్మరణకు వస్తోంది. కుమారా, నీవు కోరిన చోటుకు వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను. కాని, నన్నిప్పుడు వదలిపెట్టకు... లేకపోతే నేను ప్రాణాలు వదులుతాను.'

'అందుకే నిన్ను తీసుకుపోడానికి వచ్చానమ్మా, నా వెంట నడు.'

'ఎక్కడికి తీసుకుపోతావో చెప్పనేలేదు.'

'నిర్వాణ పథానికి.'

ఇలా అని విమల స్థవిరుడు తల్లికి ఉపదేశించడం మొదలు పెట్టాడు. క్రమంగా [illegible] దూరం కాసాగింది. మమత, మోహం, క్రోధం లీనం కాజొచ్చాయి. పాలి మనసు కామాన్ని, చెడు తలంపులనూ విడిచి వితర్కం, విచారం వివేకజన్య ప్రీతియుక్త సుఖం— వీటిని స్పృశించింది. దీన్ని 'ప్రథమధ్యానము' అంటారు. ఆమెకు మళ్లీ ద్వితీయ ధ్యానావస్థ ప్రాప్తించింది. తృతీయ ధ్యానావస్థ ప్రాప్తించిన పిదప సుఖదుఃఖాలంటని సమతాపూర్ణమైన అంతిమ చతుర్థ ధ్యానం ప్రాప్తించింది. తరువాత ఆమెకు జన్మమరణ జ్ఞానం ప్రాప్తించింది. ఆమె జన్మ మరణాల కారణాలు తెలుసుకుంది. జన్మ మరణాలను నశింపజేయు ఉపాయాలు ఆమెకు కన్పించాయి. భావి జన్మలు క్షీణించాయి. పవిత్ర వర్తమానం సాక్షాత్కరించింది. ఇప్పుడామె చేయవలసిన కార్యం మిగులలేదు. ఆమెకు సంపూర్ణ జ్ఞానం ప్రాప్తించింది. పాలీశ్వరి అర్హతనుపొందింది. తుదకు 'పాలీశ్వరి' పేరుతో అర్హతపొంది ఆమె బౌద్ధ భిక్షుణి అయింది.

మరునాడు పాలి వైశాలి విడిచి వెళ్లిపోయింది. నగరమంతా విస్మయాన్ని పొంది ఈ ఘటనను అవలోకిస్తోంది. ఆమె భిక్షు సంఘం శరణులో రాజగృహంవైపు పోతోంది.

జీవితంలో ఆఖరిదశలో దేశవర్తకి యైన మహాత్మురాలు పాలి తిరిగి ఒకసారి తన గురువు— తన పుత్రుని కృపవల్లనే మహాత్మురాలయింది.

ఈ ఘటనను తెలిసి యుండవలసిన ఒకడేవ్యక్తి ఈ ఘటన నెరగడు. అతడు బింబిసారుడు.

* * *

'నే నంగీకరించను, సంజయా!'

బింబిసారుడు వృద్ధత్వం అను దేహళిలో కాలు పెట్టాడు. అతడు వేగంగా తల వూపుతూ మహామాత్యుడు సంజయుణ్ని విరోధించాడు— 'లిచ్ఛవీయగణం నిశ్చయంగా వీరులైనా కావచ్చు. కాని వారు హఠాత్తుగా ఇంతగా శాంతించగలరను విషయం మాత్రం నే నంగీకరించలేను.'

'నాకంగీకరించవలసి వచ్చింది, మహారాజా, మాగధీయులూ లిచ్ఛవీయులూ ఇప్పటికీ పోట్లాడు కుంటున్నారని చెప్పగలగడానికి గడచిన ఎనిమిది నెలలలో మగధ— అవరాంతలో ఏ ప్రదేశంలోనూ ఒక్క ఘటన కూడా సంభవించలేదు.'

'అయితే, ఇది లిచ్ఛవీయుల వ్యూహం కావచ్చు.'

'కాదు, మహారాజా.'

'అయితే, లిచ్ఛవీయు లేదైనా రోగం చేత పీడింపబడుతూ ఉండవచ్చు.'

'కాదు, దేవా, వాళ్లకి విషి ఎక్కుతూంది.'



'సంజయా, నీవు వృద్ధుడవయ్యావని నేను నీకు ప్రతిదినం చెప్తున్నాను. నీవు అధికంగా మాట్లాడతావు. ఖచ్చితంగా అంగీకరించవు.'

'దేవా, లిచ్ఛవీయుల లాగ మాకూ కై పెక్కుతోంది.'

'ఆ!.....?'

'అవును, ప్రభూ. వైశాలీ మగధ సీమలో ఒక థేరి ఎక్కువగా సంచరిస్తోంది. ఆమె వెళ్ళినచోటల్లా లిచ్ఛవీయులు, మాగధీయులు ఆమె ఆజ్ఞను మన్నించడానికి శిరము వంచి సిద్ధమవుతున్నారు. ఆమె ఏ విషయం నిషేధిస్తుందో దాన్ని ప్రతి లిచ్ఛవీయుడు, మాగధీయుడు ఆనందంతో మన్నిస్తారు.'

'మాగధీయులు, లిచ్ఛవీయులు కలసి ఏకమవుతున్నారా? ఏ కార్యాన్ని నా వివాహం కూడ సఫలం చేయలేక పోయిందో, దాన్ని ఒక 'థేరి' సఫలం కావిస్తోందా?... ఆ 'థేరి' ఎవరు సంజయా?... ఉపచారా, ఏటాచారా,....కిసా గౌతమా?'

'కాదు, మహారాజా?'

'అయితే ఎవరో క్రొత్త థేరి అయి ఉంటుంది.'

'అవును, మహారాజా. ఆమె సంఘంలో ప్రవేశించి ఇప్పటికొక సంవత్సరమైనా పూర్తి కాలేదు. అయినా, ఆమె అర్హత పొంది సంఘంలో ప్రవేశించింది. తథాగతుని భిక్షు సంఘంలో అందరూ సమానమైనట్లే, ఆయన అనుయాయులూ ఒక్కటే అనీ, అభిజాత్యాలనీ ఆ థేరి ముఖ్య ఉపదేశం. ఆమె అందరినీ ఒక ఛత్రం క్రింద నిలబెట్టి, పరస్పర విరోధం పోగొట్టి, అందరి హృదయాలలోనూ తన మానవ ప్రేమాంకురాలు నాటింది.'

'సంజయా, ఆమెను రాజమహాలుకు రావడానికి ఆహ్వానించు.'

'ఆమె రాజ మహాలుకు రాదు, మహారాజా!'

'నిజమే? అయితే సంజయా, నీవు నన్ను ఆమె దగ్గరికి తీసుకుపో.'

'కాదు, దేవా. మీరక్కడికి పోనవసరం లేదు....'

బింబిసారుడు ఉదరి పడ్డాడు. ఎందుకంటే చెప్పేది సంజయుడు కదు! ఐశ్వర్యాధికారం చేత, అధికార మదంచేత మహారాణి చేలన. ఆమె వాణిలో వినమ్రత కంటె అహంకారం అధికంగా ఉంది. ... ... వచ్చి ఆమె సంజయునితో అంది— 'నీ మ...

# ఆమ్రపాలి

బుద్ధుడు, అతని సంఘమూ జీవించి ఉన్నంతకాలం థేరిలకి లోపం లేదు. ఈ థేరి రాజగృహంలో ఎవరి దగ్గరికి వచ్చినా చూడబడగలదు, మహామంత్రీజీ!'

'మహారాణీజీ, ఈ థేరి రాజగృహానికి వస్తుంది....' అని సంజయుడన్నాడు.

'నగర శ్రేష్ఠి ఆమె నాహ్వానించాడు, పవారణా*తరవాత ఆమె స్త్రీలకు ఉపదేశించడానికి ఇక్కడకూ వస్తుంది.'

'ఎన్ని దినాలలో, సంజయా?' అని బింబిసారుడు అత్యంత కుతూహలంతో అడిగాడు.

'ఈ పౌర్ణమికే, మహారాజా.'

'పూర్ణిమకా?' అని బింబిసారుడు విస్మితుడై ప్రశ్నించాడు.

ఓహో, పూర్ణిమ!.... మహారాణీ, ఈ పూర్ణిమకు యువరాజు అజాత శత్రువు కోపించాడు. అతడు నాకింతవరకు లభించనే లేదు. కొంచెం చూసిరా, కోపం ఇప్పటికైనా శాంతించిందో లేదో?'

'మీ పుత్రుడు నా మాట వింటాడా? అతని కోపాన్ని మీరు మార్చ గలరా, నేనా....?'

'మాగధరాజ్ఞీ, నేనిప్పుడు ముసలి వాణ్ణి కావస్తున్నాను. మాట్లాడడం లోనూ కొంత పొరపడి ఉండవచ్చు. కాని ఈ మాత్రం మాటకు యువరాజున కింత కోపం ఉచితంగా కన్పించదు. నడు. అతన్ని అంగీకరింపజెయ్యి.'

బింబిసారుని ఈ చివరి మాటలతో అనునయముంది.

చేలన అధికంగా ఏమీ చెప్పక అక్కడి నుండి వెళ్ళిపోయింది. మహారాజు రాత్రిం బగళ్ళు సంజయునితో ఉండడం ఆమెకు నచ్చలేదు. ఈ విషయం సంజయునికీ, బింబిసారుడికీ తెలిసిపోయింది. కాబట్టి, చేలన వెళ్ళగానే సంజయుడు మహారాజును

*బౌద్ధ భిక్షువులు సంవత్సరంలో ఎనిమిది మాసాలు తిరుగుతూ ఉంటారు. నాలుగు నెలలు ఒకచోటనే ఉంటారు. దీనిని వాళ్ళు వస్సావాసము (వర్షావాసము) అను పేరుతో పిలుస్తారు. వర్షావాసానికి అంతాన్ని జరుగు ధార్మిక క్రియ పేరు 'పవారణా'.

సమీపించి — 'దేవా, ఆమె ఎవరో ఎరు దురా?' అన్నాడు.

'ఎవరు?'

'పాలిథేరి!'

'ఆఁ.... ఆఁ. ఆమె ఎవరు సంజయా'

'ఆమె వైశాలికి చెందినది, మహారాజ'

'వైశాలికి చెందినదా?' అని బిం సారుడాలోచింప సాగాడు.

'ఇంకా తెలియలేదా, మహారాజ వైశాలిలోని ఒక నర్తకి, లిచ్ఛవీ రాష్ట్రంలోని ఒక గొప్ప సేవకురాలు..

'చాలు, సంజయా, ఇంక మాట్లాడక' బింబిసారుని మర్మస్థానానికి దెబ్బ త నట్లయింది. అతడు మళ్ళీ అన్నాడు. 'ఆమె థేరి అయిందా? కాకపోతే ఏం చే గలదు? కాని సంజయా, నీవు నాకు నే వరకూ కొంచెమైనా సూచించలేదే?'

'ఏండ్ల క్రితం మరచిన ఘటన జ్ఞాపకం చేయడం ఉచితంగా కనిపించ లేదు.'

'అయితే, ఈ రోజున ఎందుకు స్మరణ తెచ్చావు?'

'మహారాజా....' సంజయుని స్వర మారిపోయింది.

అతని ముఖంలో భయాతంకం అలు కొంది. ఒక్కసారిగ అతడు బింబిసార దగ్గరకు వెళ్ళి అతన్ని కౌగిలించుకొ అన్నాడు— 'మీరు థేరిని చూడాల మిషతో ఇక్కడకువస్తే మంచిది. పూర్ణి లోపల థేరిని సీమాంతంలో కలిసికోడ హితకరం...'

'అంటే...' సంజయునికి ఎదురై బింబిసారుడన్నాడు.

సంజయుడు చుట్టు ప్రక్కల చూ చాల మందస్వరంతో అన్నాడు — 'మహా రాజా, యువరాజు కోపగించలేదు. విషయ మింకొకటి. ఆయన కోరేదేమంటే....

బింబిసారుడు తక్షణం అతని చెం పట్టుకుని అతన్ని చూసి అన్నాడు— 'ఏం కోరుతున్నాడు, సంజయా త్వరగా చెప్పు... ఆగకు, విషయం పూర్తి చెప్పు.'

'మహారాజా.... దేవా....'

'చెప్పు సంజయా, వేగంగా చెప్పు యువరాజేమి కోరుతున్నాడు?'

'రాజ సింహాసనం.'

(ఇంకా ఉంది)

# కమ్యూనిస్టు దేశాలలో కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్

(గత సంచిక తరువాయి)

ఆర్. వెంకట్రామన్

విదేశీయులు, మనలో పలువురిలాగ భోజనాన్ని ఏదో కర్తవ్యం, విధి అని భావించి, స్వల్పకాల వ్యవధిలో ముగించు కోరు. భోజనం కోసం వారు ప్రత్యేకించే కాలం ఎక్కువయినా, ముఖ్య మైనది.

సోవియట్ యూనియన్‌లో విందు అంటే, దాని కోసం కనీసం రెండు గంటల సమయమన్నా ప్రత్యేకించాలి. పగలు విందు ఒంటి గంటకు ఆరంభిస్తే, విందు ముగియడానికి మూడు గంటలవు తుంది.

మొదట్లో కామరాజ్‌కు ఈ విందు ఏర్పాట్లు కొంచెం కష్టంగానే వుండేవి. విస్పటిలాగ ప్రకారం త్వరగా భోజనం చేసి, పగలు కొంతసేపు విశ్రాంతి తీసు కొనే ఆయన అలవాటుకు ఇది కొంత



కెప్టెన్ టోపీతో పడవనడుపుతున్న కామరాజ్

ఇబ్బందిగానే వుండేది. అయినప్పటికీ ఆయన ఈ కష్టాన్ని అంతగా పట్టించుకో లేదు. విశ్రాంతి తీసుకోడం వాయిదా వేశారు. తన రష్యా పర్యటన మూలంగా ఎన్ని విషయాలు గ్రహించడానికి సాధ్యమో అన్నిటినీ గ్రహించదలచారు. దానికోసం అన్ని ఇబ్బందులూ పడడానికి సిద్ధ మయ్యారు.

తదనుగుణంగానే వాల్గ్రాడ్‌లో పగలు 1—30 గంటకు విందుముగించు కుని 2—30 గంటకెల్లా వాల్గ్రాడ్ సమీపంలోని ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాన్ని చూడడానికి బయలు దేరారు కామరాజ్.

సోవియట్ దేశంలో గడచిన పదిహేను సంవత్సరాలుగా ఆహారోత్పత్తి కోసం పెక్కు మహత్తర ప్రణాళికలు ప్రారంభించ [illegible]

భూములను చక్కబరచి వ్యవసాయ యోగ్యం చేసే మహత్తర ప్రణాళిక 1954లో ప్రారంభించబడిన ఈ ప్రణా ళికలో కజక్‌స్తాన్, సైబీరియా, వాల్గ పరిసర ప్రాంతం, యూరల్ ప్రాంతం— నీటిలో ఇంచు మించు పదికోట్ల యకరాల బీడు భూమిని సాగుచేయడానికి పథకాలు సిద్ధపరిచారు. అలా సిద్ధ పరచిన పథ కాలలో ఒక్కటి 'వాల్గ—డాన్' ప్రభుత్వ వ్యవసాయ క్షేత్ర పథకం.

దీనిని చూడడానికి కామరాజ్ ఒక ఆవిరి పడవలో ఎక్కి వాల్గ నదిలో పయ నించారు.

ఆవిరి పడవ కేప్టెన్ కామరాజ్‌ను ప్రేమతో ఆహ్వానించారు. పడవ కాబిన్‌కు ఆయనను పిలుచుకుని వెళ్లారు. ఆయన ధరించే — నావికుల — టోపీని కామ రాజ్‌కు ఇచ్చి ధరించుకోవలసిందని కోరారు. కామరాజ్ దానిని ధరించుకుని కొంత సేపు ఆ కేప్టెన్ సహాయంతో ఆ పడవ నడిపారు.

స్టాలిన్ కాలంలో వాల్గానది నీటిని ఒక పెద్ద కాలువ మూలంగా నల్ల సము ద్రంలో కలపాలనే పథకం ప్రారంభించ బడింది. వాల్గానది తగ్గులోను నల్ల సముద్రం ఎత్తులోను వుండడం వల్ల కాలువలలో పెక్కు మడుగులు కట్టి నీటి మట్టాన్ని పెచ్చించి పైకి తీసుకుని పోతున్నారు. దీనినొక బ్రహ్మాండ మయిన, అపూర్వ మైన విజయం అనే చెప్పవచ్చు. 'డాన్' కాలువను కట్టిన తర్వాత, అంత [illegible]

చొరరాకుండాను వున్న ప్రాంతం సార వంతమైన ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంగా మారింది. సంపద్విలసితమై, పాఠశాలలు, ఆస్పత్రులు, సినిమాలు, దుకాణాలు మొద లయిన వాటితో ఒక నూతన నగరమే లేచింది.

కామరాజ్ దర్శించిన వాల్గ— డాన్ వ్యవసాయ క్షేత్రం ప్రభుత్వ క్షేత్రం. దాదాపు 40 వేల యకరాల విస్తీర్ణమైనది. దానిలో కూరగాయలు, పశుగ్రాసం, జొన్న, గోధుమ మొదలయినవి సైరు చేస్తున్నారు. దీనితో పాటు పాడి కేంద్రం, కోళ్ల పెంపకం కేంద్రం, పందులపెంపకం వంటి పశుసంపదభివృద్ధి జరుపబడు తున్నది. డాన్ కాలువ నుంచి చిన్న కాలువ తవ్వి ఈ వ్యవసాయ క్షేత్రానికి నీరు సర ఫరా చేయబడుతున్నది.

మేము వెళ్లినప్పుడు 600 అడుగుల మేర అకస్మాత్తుగా వర్షం పడసాగింది. ఎర్రటి ఎండ కాస్తున్నప్పుడు, వర్షం ఎలా పడుతుంది అని ఆశ్చర్యపడ్డాము. కాలువ నీటిని యంత్రాలతో 'పంప్' చేసి, దానిని సైర్లకు పదడుగుల ఎత్తున వున్న గొట్టాల ద్వారా పారించి వాన పడేట్లు షవర్లతో చిలకరిస్తున్నారు. ఈ విధమైన షవర్లతో చిలకరించడం మూలంగా నీరు పొదుపుగా వాడబడడం మాత్రమే కాక సైరు చక్కగా ఎదుగు తుంది.

కూరగాయలు పండించే తోటకు వెళ్లాము. అక్కడ పని చేస్తున్న మహిళలు కామరాజ్‌ను చుట్టు ముట్టి కొన్ని క్యారెట్లు దుంపలను దోసిళ్లతో తెచ్చి ఆయనకు ఇచ్చారు. కొందరు దోస పిందెలను ఇచ్చారు. కొందరు టొమాటో లను బహూకరించారు. అందరూ ఇస్తున్న కూరగాయలను తీసుకోలేక కామరాజ్ తికమక పడ్డారు. ఆరోగ్యకరమైన వాతా వరణంలో, సారవంతమైన ఆహార పదార్థా లను భుజించి జీవించే వారు ఆ వ్యవ సాయదార్లు. కామరాజ్ ఆ వ్యవసాయ దార్లతో సంభాషించారు.

ఏమి సంభాషించారో తెలుసా?

మరేమిటని గురించి సంభాషిస్తారు? ప్రపంచంలో ఏ ప్రాంతానికి వెళ్లినా, అది తమిళనాడయినా సరే, రష్యా దేశ

అయినా వేళ, ఆయనకున్న చింత ఒక్కటే. "మీకు ఇక్కడ అన్ని వసతులు వున్నాయా? చదువు సౌకర్యాలు ఏమిటి? రాబడి ఎంత? వైద్య సౌకర్యాలు వున్నాయా? అభివృద్ధితో వుంటున్నారా?"

ఇలాటి ప్రశ్నలు విని ఆ ప్రజలు కొంత సేపు ఆశ్చర్యపడ్డారు. తర్వాత సమాధానం చెప్పారు:

నేను కొందరిని చూచి, "మీకందరికి పట్టణానికి వెళ్ళే ఇష్టం లేదా? గ్రామంలో వుండడానికే ఇష్టపడుతున్నారా?" అని అడిగాను.

"మా జీవితం గ్రామంలోనే చాల రమ్యంగా వుంది. దానికితోడు మేము ఎప్పుడు కోరితే అప్పుడు, పట్టణానికి పోయి కాలం గడపవచ్చు." అని వారు సమాధానం చెప్పారు.

ఒక దేశం వుత్పత్తిని, సంపదను బాగా తెలుసుకోవాలంటే, ఆ దేశంలో వున్న పెద్ద దుకాణాలకు పోయి చూస్తే, కొంత తెలుసుకోవచ్చు. దుకాణాలలో వున్న

# కామరాజ్

వస్తువులు వుత్పత్తికి తార్కాణం. ప్రజలు విరివిగా వచ్చి ఆ వస్తువులను కొంటే, అది ఆ దేశ ప్రజల కొనుగోలుశక్తి ఎంత అభివృద్ధి చెందిందనడానికి గుర్తు. నేను వెళ్ళిన విదేశాలన్నిటా, అరగంటయినా ఈ "స్టోర్స్"ను చూడకుండా రాను. ఆ స్టోర్స్ వల్ల ఆ ప్రజల కొనుగోలు శక్తి దేశంలో వుత్పత్తి గొప్పదనం మొదలయిన వాటిని కొంతవరకు తెలుసుకోవచ్చు.

అందువల్లనే వ్యవసాయ క్షేత్రం చూసిన తర్వాత ఆ వ్యవసాయ క్షేత్రం నిర్వహించే స్టోర్స్ ఒకదానిని చూదాం రాండి అని కామరాజ్ పిలిచినప్పుడు, నేను చాల సంతోషించాను.

ఆ దుకాణంలో పిల్లలకు అవసరమైన అపూర్వమైన వస్తువులు విరాళంగా వున్నాయి. రేడియో, టేప్‌రికార్డర్, గడియారాలు, పూలకుండీలు వంటి విలాస వస్తువులు అక్కడ వున్నాయి. మేము అక్కడికి వెళ్ళినప్పుడు, సాయంకాలం 5 గంటలు. అందువల్ల వ్యవసాయ క్షేత్రం నుంచి తిరిగి వెళ్ళేవారు గుంపులు గుంపులుగా వచ్చి, ఆహార వస్తువులను తీసుకొని వెళ్ళారు. పాలు, వెన్న, బ్రెడ్డు, పచ్చి (మాంసం), కూరగాయలు, ఇవన్నీ అక్కడ విశేషంగా కనిపించాయి. ఆ వ్యవసాయ క్షేత్రంలో వున్న 4000 మంది అవసరాలను ఈ స్టోర్స్ తీరుస్తుంది.

వ్యవసాయ క్షేత్రం నుంచి వెలుపలికి రాగానే, కామరాజ్ అకస్మాత్తుగా "ఇక్కడ వున్న ఒక ఇంటిని చూడవచ్చా ?" అడిగారు.

"ఓ!" అని వారు సమాధాన మిచ్చి అప్పుడు మేము వెళ్ళుతున్న ప్రాంతానికి సమీపంలో వున్న ఒక యింటికి కామరాజ్‌ను పిలుచుకొని వెళ్ళారు. ఆ యిల్లు కూడా "ప్రీఫ్యాబ్రికేటెడ్" పద్ధతిలో కట్టిన యిల్లే. అది అక్కడ వున్న ఒక ప్రాథమిక పాఠశాల పంతులది. ఆ పంతులు యింట్లో రేడియో, టెలివిజన్ సెట్, టేప్‌రికార్డర్ మొదలయినవన్నీ వున్నాయి.

"మీరు ఈ యింటికి ఎంత అద్దె చెల్లిస్తారు?" అని ప్రశ్నించారు కామరాజ్.

"నాకు తెలియదు" అని ఆ బడి పంతులు సమాధాన మిచ్చి, "నా జీతం ఈ నివాస వసతితో పాటే. మా వ్యవసాయ క్షేత్రం ఈ ఇంటికి ఎంత అద్దె కడుతుందో నాకు తెలియదు." అని వివరించారు.

సమీపంలోనే వున్న మరొక యింటికి వెళ్ళారు కామరాజ్. అది ఒంటిగది యిల్లు. ఆ ఒంటి గది యింటిలోను రేడియో టెలివిజన్ కనిపించాయి.

సామాన్యంగా రష్యాకు వెళ్ళేవారు మొదట్లోనే నిర్ణయించిన ప్రదేశాలను చూడడానికి మాత్రమే అనుమతి వుంటుం దనే ప్రవాదం వుంది. అయితే, కామరాజ్ హఠాత్తుగా, ఈ రెండిళ్ళను చూడాలని అభిప్రాయపడ్డారు, వెంటనే వెళ్ళి చూచారు. ఈ రెండు చోట్ల చూడడానికి ఎలాటి ముందు హెచ్చరికలు గాని, ఏర్పాట్లు గాని జరుగలేదు.

ఈ కారణం వల్ల ఈ వ్యవసాయ క్షేత్రాన్ని మేము చూడడానికి లోగడ నిర్ణయించిన వ్యవధికన్నా మరి కొంత సేపు పట్టింది.

వాల్గాగ్రాడ్‌లో కామరాజ్‌కు అధికార పూర్వకమైన విందొకటి ఏర్పాటు అయి వుండినది. దానికి ఆలస్య మవుతుందని మొదట్లోనే ఆలోచించిన మా "ప్రోటోకోల్" అధికారి చాలా వడిగా పోయే పడవను మా ప్రయాణానికి ఏర్పాటు చేశారు.

సాధారణమైన ఆవిరి పోడలు గంటకు 30 మైళ్ళ వేగంతో వెళ్ళుతాయి. రష్యాలో ప్రస్తుతం నిర్మించిన 'రాకెట్' అనే పేరుగల పడవలు గంటకు 60 మైళ్ళ ప్రయాణం చేస్తాయి. ఈ ఓడలకు తక్కిన ఓడలకు వ్యత్యాసం వుంది. ఇది నీటిలో వెళ్ళడం ప్రారంభించిన వెంటనే, దీనిముందుభాగం నీటిపైకి లేచి నీటిని చీల్చుకు వెళ్ళుతుంది. దీనిని "హైడ్రోకేబాయిల్" అని ఇంగ్లీషులో అంటున్నారు. ఇలాటి ఆవిరి ఓడలు నార్వే, స్వీడన్ దేశాలలో విరివిగా వుపయోగ పడుతున్నాయి.

వాల్గాగ్రాడ్‌లో జరిగిన అధికార పూర్వకమైన విందులో మేయర్ కొరా పోప్‌టోన్ట్స్ "బెబుతూ కామరాజును చాల ప్రశంసించారు." "మీరాక వాల్గాగ్రాడ్ పౌరులకు పట్టుదలను, ఉత్సాహాన్ని కలిగించింది. మిమ్ములను దర్శించి నర్సరీపాఠశాలలపిల్లలు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్ర వ్యవసాయదారుల్లు చాల ఆనందించారు." అని అన్నారు. తర్వాత వాల్గాగ్రాడ్ ప్రజలు యుద్ధసమయంలో పడిన బాధలను వివరించి, ఇక ప్రపంచంలో యుద్ధం రానీయకుండా ప్రజానాయకులందరూ ప్రయత్నించాలని, దానికి భారత దేశనాయకులు తోడునీడగా వుండాలని కోరారు.

దానికి కామరాజ్ సమాధానంచెప్పారు:—

"మీనగరమంతటా తిరిగి చూచిన పిదప మీనగర పౌరులు ఆరితేరిన యుద్ధ వీరులుమాత్రమే గాక కష్టించి పని చేసేవారని కూడా నేను తెలుసుకున్నాను. చెప్పరానంత నష్టంపొందిన మీపట్టణాన్ని ముందుకు మించిన ఐశ్వర్యాభ్యుదయాలుగల మహానగరంగా మీరు నిర్మించుకున్నారు. ఇది మీకు గొప్పతనం తెచ్చేసంగతి. మీరు మీవూరిపిల్లలపై చూపేవాత్సల్యం శ్రద్ధ నాకునన్నును అత్యంతం ముగ్ధంచేశాయి. భవిష్యత్తులో దేశాన్ని కాపాడడానికి, దృఢతరం చేయటానికి కావలసిన మనో బలాన్ని శిక్షణను మీపిల్లలకు పసితనంలోనే బోధిస్తున్నారు. మీలాగ మేము కూడా విశ్వశాంతినే కోరుతున్నాము. ప్రపంచంలో శాంతి నెలకొని వుండేనే మాదేశంలో మేము ప్రారంభించిన ప్రణాళికలను ఆటంకంలేకుండా నెరవేర్చడం సాధ్యం. మనరెండు దేశాలమధ్య వున్న సత్సంబంధాలు ఇతోధికంగా బలపడు తాయని విశ్వసిస్తున్నాను."

కామరాజ్ ఈవిధంగా సమాధానం చెప్పిన తర్వాత మమ్ములను గౌరవించిన వాల్గాగ్రాడ్ మేయర్‌కు జీలుగు బెండుతో చేసిన తంజావూర్ దేవాలయం గోపుర ప్రతిరూపాన్ని బహూకరించారు. విందులో పాల్గొన్న ప్రముఖులు వాల్గాగ్రాడ్ ప్రాంత నిర్వాహకురాలు మొదలైనవారంతా ఆగోపురం పనితనాన్ని చూచి ఆశ్చర్యపడ్డారు. అది ఎలా తయారు చేసిందితెలుసుకొనడానికి ఎంతో ఆసక్తి చూపారు. "దంతమా?" అనిప్రశ్నించారు ఒకరు. మరొకరికి అది "చలువరాతిదా!" అనిసందేహం ఏర్పడింది. దానికలా విలసనం వారందరినీ సంతృప్తులను చేసింది. "విదేశప్రముఖులు బహూకరించిన ఉత్తమ వస్తువుల ప్రదర్శన శాలలో ఈతంజావూరు గోపురం ప్రత్యేక స్థానం పొందుతుంది" అని ఆనందంతో చెప్పారు మేయర్.

(సశేషం)

—అనువాదం: తి రా.

(ఆనందవికటన్ సౌజన్యంతో)




పత్నేటూరి పిల్లబడిలో ఐదవ తరగతికి పాఠాలు చెప్పే పంతులు గారికి మధ్యాహ్న భోజనం అయ్యాక కునికిపాట్లు వస్తున్నాయి. పిల్లలు అల్లరి చేయకుండా ఉండేందుకని చిట్కా ప్రయోగించారు.—"9734374916204 ని 6277348194 పెట్టి గుణించండర్రా! అల్లరి చేశారంటే వీపు చీరేస్తాను." అని గర్జించి, కుర్చీకి జేర్లబడి గురకతీయసాగేరు.

సుమారు రెండున్నర గంటల తరువాత క్లాసులో పిల్లలు లెక్కచేసిన పుస్తకాలు తెసుకువచ్చారు. కొండవీటిసీమ చేంతాడు అంతేసి పొడుగున్న ఆ జవాబులు చూసే సరికి పంతులు గారికి చిరాకు పుట్టుకు వచ్చింది. నిద్దర మత్తులో నోటికివచ్చిన అంకెలు ఏవేవో ఇచ్చేశారు కాని, వాటిని తప్పులు పోకుండా గుణించడం తనకిమాత్రం సాధ్యమా? ప్రమాదోధీమతామపి అన్నారు. మరి ఇప్పుడు క్లాసులో ఎవరెవరు లెక్క సరిగ్గా చేశారో, ఎవరెవరు తప్పుచేశారో తెలుసుకోవడం ఎల్లాగా? పోనీ క్లాసులో ఉన్న పాతిక మంది పిల్లల్లోనూ ఎక్కువ మందికి వచ్చిన జవాబు రైటు అనీ, మిగిలినవి తప్పు అని నిర్ణయించి, తప్పు చేసిన వాళ్ళ ముణుకుల మీద రూళ్ళకర్రతో రెండు రెండు వడ్డించేద్దామను కున్నారు. కాని, తీరా చూస్తే పాతిక మందిలోనూ ఇద్దరికి ఒక జవాబు, అయిదుగురికి ఒక జవాబు, ఆరుగురికి ఒక జవాబు, మిగిలిన వారందరికీ తలో జవాబున్నూ వచ్చేయి. ఇందులో ఎవరిది రైటు అనుకోవాలి? ఇప్పుడు ఏమిటి సాధనం? పంతులుగారికి నిద్ర మత్తు వదిలిపోయింది. అంతలో ఆపద్బాంధవుడిలా పక్క ఇంటి గోడ గడియారం టాంగ్ టాంగ్‌మని ఐదు కొట్టింది.

"ఈ పూటకి ఇళ్ళకి పొండర్రా!" అని పంతులుగారు ఇంటి దారి పట్టేరు.

అదిగో సరిగ్గా అటువంటి పంతుళ్ళకి సాయం చెయ్యాలనే సదుద్దేశంతో ఈ వ్యాసం వ్రాస్తున్నాను.

కూడికలు, తీసివేతలు, గుణకారాలు,




భాగహారాలు, వర్గమూలాలు, వర్గమూలములు, ఘనములు, ఘన మూలములు— ఎంతెంత పెద్దవి అయినాసరే వచ్చిన జవాబులు రైటో తప్పో సునాయాసంగా చెప్పేసే పద్ధతి ఒకటి వుంది. ఆ చిట్కా తెలుసుకునే ముందు "మూలాంకము" (Digital root) అనే కొత్త మాట నొకదానిని నేర్చుకోవాలి. తప్పదు మరి.

ఉదాహరణకి 917534 అనే సంఖ్య ఉన్న దనుకుందాం. ఇందులోని అంకెలన్నీకూడితే $9+1+7+5+3+4=29$ వస్తుంది. మళ్ళీ 29 లోని అంకెలను కూడితే $2+9=11$ వస్తుంది. మళ్ళీ 11 లోని అంకెలను కూడితే 2 వస్తుంది ఇదిగో ఈ 2 ని 917534 యొక్క మూలాంకం అంటారు.

ఏ సంఖ్యకీ కూడా మూలాంకం సున్న ఉండదు. 1 నుంచి 9 వరకూ ఉన్న తొమ్మిది అంకెలే మూలాంకములు. లెక్క చెయ్యవలసిన అసలు సంఖ్యలకి బదులుగా వాటి మూలాంకములు ఉపయోగించి అదే లెక్కలు చేసి చూడాలి.

ఉదాహరణకి పంతులు గారు ఇచ్చిన గుణకారంలో మొదటి సంఖ్యకి 5 మూలాంకం. రెండవ సంఖ్యకి 6 మూలాంకం. ఈ రెండు మూలాంకములనూ గుణిస్తే $5\times6=30$ లేక $3+0=3$ వస్తుంది. కనుక అసలు సంఖ్యలను గుణించగా వచ్చే లబ్ధం యొక్క మూలాంకం 3 అయి ఉంటుంది. పిల్లలు ఇచ్చిన జవాబుకి మూలాంకం కనుక్కుని అది 3 కి సమానం అయిందో లేదో చూడు. 3 కి సమానం కాకపోతే లెక్క తప్పు అన్నమాట! ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. జవాబు యొక్క మూలాంకం సరిగ్గా లేకపోతే లెక్క తప్పు అని ఢంకా మీద దెబ్బ కొట్టి చెప్పవచ్చును కాని, మూలాంకం సరిగ్గా ఉన్నంతమాత్రాన జవాబు రైటు అనడానికి వీలు లేదు. ఏమంటే, 420 కీ, 402 కీ, 240 కీ, 204 కీ, 24 కీ, 42 కీ, కూడా మూలాంకం ఆరే. కాని అవి అన్నీ వేరు వేరు సంఖ్యలు కదా!

ఇల్లాగే అన్ని రకాల లెక్కలకు మూలాంకాలు సరిగ్గా లేకపోతే లెక్క తప్పు అని సులభంగా చెప్పవచ్చు. ఒక్కొక్కరకపు లెక్కకు ఒక్కొక్క ఉదాహరణ ఇస్తాను.

కూడిక: $474+691=1065$ అని వచ్చింది అనుకుందాం.

474 యొక్క మూలాంకం 6:
691 యొక్క మూలాంకం 7. ఈ మూలాంకాలు కూడితే , 6+7=13 లేక 1+3=4 వస్తుంది. కాని వచ్చిన జవాబు (1065) కి మూలాంకం 3.

రావలసిన మూలాంకం 4 అయితే, 3 వచ్చింది. కనుక ఈ జవాబు తప్పు.

తీసివేత: 903 — 376 = 427 అని వచ్చింది అనుకో. 903 మూలాంకం 3; 376 మూలాంకం 7. 3లో నుంచి 7 తీసివేయడం సాధ్యం కాదు. కనుక 9 అప్పు పుచ్చుకోవాలి. (మనం మామూలుగా చేసే లెక్కలలో 10 అప్పు పుచ్చుకున్నట్టు ఇక్కడ 9 అప్పు తీసుకోవాలి.)

9+3=12. ఇప్పుడు 12—7=5. 427 కి మూలాంకం 4.

రావలసిన మూలాంకం 5 అయితే వచ్చినది 4 కనుక జవాబు తప్పు.

భాగహారం: 73091 ని 74 చే భాగిస్తే 987 విభక్తం వచ్చింది. 43 శేషం మిగిలింది. ఈ లెక్క రైటా ? తప్పా ?

విభాజ్యం (73091)కి మూలాంకం: 2
విభాజకం (74) కి మూలాంకం: 2
విభక్తం (987)కి మూలాంకం : 6
శేషం (43) కి మూలాంకం : 7

విభాజ్యము = (విభాజకము × విభక్తము) + శేషం అని మనకు తెలుసు. మూలాంకములను ఉపయోగించి ఈ సమీకరణం సరిపోయిందో లేదో చూద్దాం.

(2×6)+7=12+7=19 లేక 1 మూలాంకం. ఇది విభాజ్యపు మూలాంకానికి 2 కి సమానం కాదు. కనుక ఈ జవాబు తప్పు.

వర్గం: 671 యొక్క వర్గం 450341 అని వచ్చింది. ఇది రైటా తప్పా ?

671 యొక్క మూలాంకం 5
5 యొక్క వర్గం 25. లేక 2+5=7
వచ్చిన జవాబు యొక్క మూలాంకం 8. కనుక ఈ జవాబు తప్పు.

ఈ విధంగా, చేసిన లెక్కలు తప్పో కాదో నిర్ణయించవచ్చు.

షరా: ఈ చిట్కాలు పంతుళ్లకోసమే కాని, విద్యార్థులకు కాదు. ●




1793 వ సంవత్సరము. పారిస్ నగరములో డిసిల్ట్ (సర్జన్)గారి బోధనశాల. ఆయన పాఠము అయిన తర్వాత విద్యార్థులలో ఒకరిని ఎంచి ఆ పాఠ సారాంశాన్ని గురించి మొత్తపు క్లాసుముందు చెప్పమని ఆయన సహోపన్యాసకుడు కుర్చీ మీద కూర్చుని పర్యవేక్షణ చేసే క్లాసు. 'కాలరు ఎముక విరిగే తీరులు' అప్పటి విషయము. క్లాసు అంతా తయారైపోయింది, సహోపన్యాసకుడు ఆనాడు 'మాట్లాడవలసిన విద్యార్థి వచ్చి ప్రారంభించవచ్చు' అన్నాడు. చిత్రము. ఎవరూ లేవలేదు. ఆయన గారు మొహము చిట్లించాడు. ఆసంగతి తెలగానె ఆక్లాసులోని గ్జేవియర్ బిఛాట్ 'నేను చెప్తా'నని లేచాడు.

బిఛాట్ తండ్రి వైద్యుడు. బిఛాట్ లయన్సులో వైద్యము చదివి, ఫ్రెంచి విప్లవపు కల్లోలాలలో నానా అవస్థలూ పడ్డాడు. విప్లవకారుల అరాచకపు టల్లరులలో చదువు నలిగి, చివరికి పారిస్ చేరుకొని పియరీ జోసెఫ్ డిసెల్ట్ దగ్గర చేరేడు.

అతని అప్పటి వయస్సు 22. ప్రొఫెసర్ డిసెల్ట్ క్లాసులో లెక్చరు చెప్పిన తర్వాత క్లాసులోని ఒక విద్యార్థిని ఎంచి, ఆలెక్చరుని సంగ్రహంగా చెప్పమనడమూ, ప్రొఫెసరు కాక సహోపన్యాసకుడు అధ్యక్షత వహించడమూ మామూలు. ఒకనాడు మాట్లాడవలసిన విద్యార్థి రాలేదు. అది తెలగానె బిఛాట్ 'నేను చెప్తా' నని లేచాడు. విద్యార్థి ఎందుకు రాలేదో విద్యార్థులకు తెలుసు. బిఛాట్ చేరి నెలరోజులు మాత్రమే అయింది.

హాజరుకాని విద్యార్థి ఎందుకు రాలేదో విద్యార్థులందరికీ తెలుసు. బిఛాట్ ''నేను చెప్తా'' ననగానే కిచ కిచలతో కొంత కలకలము బయలు దేరింది. బిఛాట్ ప్రారంభించి నాలుగు వాక్యాలు చెప్పే సరికి సద్దణిగి పోయింది. బిఛాట్ ముగించేవరకు మెదలకుండా కూర్చున్నారు. అతడు ముగించిన కొంత సేపటికి హోరుమని జయజయ ధ్వానాలు చేశారు. విద్యార్థి మాట్లాడినట్టు లేదు. అతని లెక్చరు, ప్రొఫెసరు మాట్లాడినట్లుంది. డిసిల్ట్ ఈసంగతి విని, బిఛాట్ పిలిచి మాట్లాడేడు. అంతవరకూ ఈయన గారు క్లాసులో వున్నట్లే తెలీదు ప్రొఫెసరుకి. అతనితో మాట్లాడి తనకి అసిస్టెంటుగా వేసుకున్నాడు ప్రొఫెసరు.

కువీయరు ఏ జంతువు ప్రత్యేకతను నిరూపించడానికి యత్నించి జంతుజాలపు అంగాంగ పరిశోధనా పోలికా చేశాడు. ఈ బాహ్య పరిశోధన అంగనిర్మాణము చేసే టిష్యూ పొరల పరిశోధనని చేర్చాడు బిఛాట్. తాను రోగుల కురుపులను, నెత్తురు పుండ్లనూ చూచినప్పుడు అంగమేదైనా గాయాలు ఒకేరీతిగా ఉన్నట్లు గుర్తించాడు బిఛాట్. అంగముల పొరల టిష్యూలూ ఒకలాగే వున్నాయా? అన్న సమస్య కలిగింది. గాయము అంటే ఈ పొరలు దెబ్బ తినడమేనా? ఈప్రశ్నకు జవాబు ఏగ్రంథములోనూ దొరకలేదు. తానే పరిశోధించడానికి పూనుకుని తనకున్న అతికొద్ది విరామాన్ని దేహములోని వివిధాంగముల పొరల గుణాలు పరిశీలించడానికి ఉపయోగించాడు. వెచ్చబెట్టడమూ, ఆరబెట్టడమూ, నానబెట్టడమూ, ద్రావణాలతో క్షారాలతో కడగడమూ, ఉప్పునీళ్లలో పెట్టడము అన్నీ చేసి ఏ అంగపు పొర ఏమే మవుతుందో పరిశోధించాడు. అయితే, మైక్రోస్కోపుని మాత్రము ఉపయోగించలేదు.

కువీయరు మొత్తపు అంగములను పోల్చి పరిశీలించాడూ, ష్వాన్, ష్లీడెన్ జీవకణాల ఉనికికి చెప్పేరు. బిఛాట్ వాటినడిమి స్థితిని ఎందుకు పట్టేడూ? అన్న వింత ప్రశ్న పుట్టుతుందిగాని, 'గాయమన్నది అంగాల సమరూప పొరలు దెబ్బతినడమేనా?' అన్న ప్రశ్నను తీర్చడానికే అతని పరిశోధన అప్పుడు దాని బరువు తెలుస్తుంది. చాలా చాలా చెప్పేడు అంగాల టిష్యూ పొరల రకాల్ని బిఛాట్. జీవకణాల పొరలు జంతువుల నరాలు ధమనులూ, సిరలూ, స్నాయువులూ, కండరాలూ, మజ్జ, చర్మము ఇంకా ఇంకా భేదాలు చెప్పేడు. ఇవన్నీ నేటి శరీర నిర్మాణాన్ని తీర్చే పొరలు. జీవకణాలు చెప్పి అంగ భేదాలు చెప్తే ఏమయినట్టు? అంగాలు చేసే పనులను వాటి చేత నిర్వహింప జేసే నిర్మాణమూ ఏమిటి? ఆనిర్మాణ విశేషాలేమిటి? అంగముల పనులను మాత్రము కాదు. మనము గుర్తించడము. ఆపనులను వాటిచేత చేయించే నిర్మాణమును కూడా—అంటే ఆపనుల కారకములను కూడా—పరిశీలించాలి. రసాయనిక మూలకాలు చేరి సంయోగాలు ఏర్పడిన విధంగా టిష్యూలు చేరి అంగము లవుతున్నాయి. 'రసాయనిక సంయోగములో చేరిన మూలకాలు స్వభావ వికృతి పొందని విధంగానే అంగములుగా కూడిన టిష్యూలు స్వభావములో మారవు. అదే టిష్యూ నరంగా ఏర్పడవచ్చునూ, చిన్న నాళము కావచ్చునూ, ఈపెలుగా ఏర్పడవచ్చును. కంటి రెటీనా పొరలోని టిష్యూ (ఆప్టిక) యే నరాలలో ఉంటున్నది. ఈరీతిగా రూపము మారినా దాని స్వభావము మారదు.

అయితే ఇందాకా చెప్పిన వేర్వేరు రకాల యొక్క పనిముట్టుకు వేరు. ప్రతిదీ దానికి కావలసినదానిని నెత్తురు నుంచి తీసుకుంటుంది. ఊటలూరడము, పీల్చుకోడమూ ఆహారము సేకరించడమూ, దేనికది దాని ప్రత్యేక పద్ధతిలో చేసుకుంటుంది. అంటే భూమిమీద కనబడే రసాయనిక పదార్థాలు—ఆక్సైడ్లూ, సల్ఫేటులూ, కార్బనేటులూ వంటి వాటిని వాటిలోని మూల పదార్థాలచేర్పు కలుగ చూచుకున్నట్లే జంతువుల అంగములను ఇందాకా చెప్పిన టిష్యూలవల్ల నిర్మించబడినవిగా చూసుకోవాలి. ప్రాణి ఏదయినా కండరపు పొర, నరాలదామము— ఇత్యాది టిష్యూల రకాలు ఒకలాగే ఉంటున్నాయి. జంతువుల అంగాల భేదము కువీయరు స్థూలంగా చెప్పినట్టిది—వాటి అంగాలను నిర్మించిన టిష్యూలలో చూడాలన్నమాట. మరొక లాగ చెప్పినట్లయితే, జీర్ణకోశము, లివరు లాంటి అంగముల ప్రత్యేకతను చక్కగా గుర్తించాలంటే వాటిని మొత్తంగా కాదు చూడడము వాటిలోని వేర్వేరు టిష్యూల భేదాల్ని గుణాల్ని చూసుకోవాలి. ఒక అంగము లోని తక్కిన టిష్యూలు బాగనే ఉండవచ్చు. ఒకటిష్యూయే పాడవవచ్చు. కనక ఆ అంగపు జబ్బును ఆటిష్యూ జబ్బుగా చూడాలన్నమాట.

బిఛాట్ పరిశోధనలో అతనికి టిష్యూసార ప్రత్యేకతని నిరూపించడానికి కావలసినంత సాక్ష్యము దొరికింది. మైక్రస్కోపు వాడకుండా జీవకణాలు అల్లుకుని ఏర్పడే టిష్యూల ప్రత్యేకతను నిరూపించి హిస్టాలజీ అన్న శరీర నిర్మాణశాఖను స్థాపించిన వాడైనాడు బిఛాట్.

ఒకరు కణాలూ ఒకరు అంగాలూ వర్ణిస్తే వాటి నడిమి నిర్మాణాన్ని పట్టి కొట్టకొట్టి కాదు బిఛాట్ గొప్పవాడవుత. వివిధాంగాల గాయాలు ఒకే లాగుంటే చూచి విస్తుపోయి కారణము వెతికి పొరల సామరస్యమునూ భేదాలనూ కనుక్కొని అన్ని అంగాల గాయాలూ ఒకేరకపు టిష్యూని పాడు చేయడము వల్ల సామరస్యము కనబడిందని గుర్తించి చెప్పేడు బిఛాట్. అతడు ఉద్యోగమూ, ప్రాక్టీసు చేసుకుంటూ ఒక శీతకాలములో ఆరు వందల శరీరాల పరీక్షలు చేశాడు.

ప్రాణాల పరీక్షను తిరగవేసినట్టు చెప్పేడు బిఛాట్. ముప్ఫై యేళ్లకే అతనికి నూరేండ్లు నిండిపోయాయి. ●

# వాళ్ళు ముగ్గురు




వై. రాంబాబు & శాయి

"మాష్టారూ!"

అగి చూచాను.

"నమస్కారం మాష్టారూ!"

కన్ను లింతింత చేసికొని పరికించాను. అందమైన రాత్రివేళ అబిడ్స్‌లో అంత వాటి దేవదాసుకు తమ్ముడైన ఇతగాడెవడు?

"నాకు తాగడం చాతకాదు. ఎప్పుడూ తాగలేదండీ! అదంటే అసహ్యం నాకు."

కాలిబాట మీద నడచిపోతున్న నలుగురూ మావంక విచిత్రంగా చూచి వెడుతున్నారు. అవతలి పెద్దమనిషి కొంచెం నెమ్మదిగా అరచినా బావుండును. అభినయ సహితంగా, సభావేదికపై ధ్వన్యనుకరణ ప్రమాట్కు మాదిరి గట్టిగా అరుస్తూ ఉంటే, మావంక నలుగురూ చూడడంతో ఆశ్చర్యం లేదు.

"పోనీ, మీరు చెప్పండి మాష్టారూ! నేను తాగానా! ఎప్పుడూ లేదు నాకు తాగడం చేతకాదుగా.."

మరో రెండుక్షణాలాగితే, మా యిద్దరి చుట్టూ అబిడ్ సర్కిల్ నిలిచిపోతుంది. అందుకని, అతని భుజం మీద చేయివేసి, "నువ్వు తాగలేదుగానీ వెడదాం రా" అని, రిక్షాలో కూలవేసి గదికి తీసుకువచ్చాను. మధ్యేమార్గంలో అతను నానా కూతలూ కూయబోయాడు. గొంతెత్తి మాధవపెద్ది బాణీ అందుకోబోయాడు. భయపడి, అతని నోరు మూశాను. అందమైన సంగతి. నోరుమూస్తే, గిలగిల గింజుకుని, బోళ్ళున వమనం చేసుకున్నాడు. నా లోపలి జీవుడు వాపోయాడు. రిక్షావాడు గుర్రుగా చూచింది. అవతలి వాడెంత వాడైనా అవసరానికి వాడివి గాడిద కాళ్ళు. నేను వసు దేవుడైనాను. అభాసు అనేక రూపాలు కాగా— ఏ విధాన అయితేనేమి, గొంతు నిండుకూ తాగినవాడిని, గదిలోనికి లాక్కు వచ్చాను.

కడుపులో సరుకు ఘాటుగా పని చేయ సాగిందేమో, ఒంటిమీద స్పృహ లేకుండా అతగాడు పడిపోయాడు. బ్రహ్మచారిని. చేతులు కాల్చుకోడానికి వెనుకాడితే, కడుపు కాల్చుకోవలసిన వాడిని. అప్పటికే అర్ధ రాత్రికి మరి మూడు గంటలే కాలం మిగి లింది. బొగ్గుల కుంపటి ముట్టించి, ఎసరుకిన్ని నీళ్ళు పోసి, ఒకసారి కథానాయ కుడి వంక చూచాను. మధ్యానికి మజ్జిగకూ పిలుపు మిగులదని చటుక్కున జ్ఞాపకానికి మెదలింది. పులుపెక్కిన వల్లను గాజా

గ్లాసులో ఒంచి, అరమూతలు పడ్డ అందమైన కళ్లతో స్వర్గపు నిచ్చెన మెట్లను చూస్తున్న ఆతగాడిని పట్టి, కుదిపివేసి "చిట్టితండ్రీ! ఇది తాగు" అని అతని చెవిలో ఆదేదో తారకమంత్రం మాదిరి అరచాను. తాగుమనగానే అతను అలవోకగా అద్దానినందుకుని, గడగడ లాడించాడు. రెండు క్షణాల పిదప, "అబ్బా!" అన్నాడు.. నా వెంపు చిత్రంగా చూచి, "నమస్కారం మాస్టారూ! మీ పేరేమిటి?" అని అడిగాడు.

నేను చిరునవ్వు చిందించాను.

"ఏమిటి?! చిదంబరమా.. ఓ! ఫోన్న పేరు. నమస్కారం సార్! నేను స్వర్గానికెళ్లొస్తా" అని చెప్పేసి మళ్లీ పక్కమీదకి ఒరిగాడు. ఇంకో పదిహేను నిమిషాల్లో అతను స్వర్గం నుంచి కొంచెం దిగజారవచ్చు. మరుగుతున్న నీళ్లల్లో, ఇద్దరికీ సరిపడా బియ్యం పోశాను. కూరచేసే ఓపిక లేదు. ఉదయం చేసిన గుత్తి వంకాయ ఉండనే ఉన్నది. కొన్నిక్షణాల పిదప, అన్నం కుతకుత ఉడుకుతూ ఉన్నది. తాగిన పెద్దమనిషిని చూస్తూ ఉంటే, మా ఆలోచనలూ ఆవిధంగానే ఉన్నాయి.

గంజి వారుస్తూ ఉంటే, ఒక పెద్ద మూలుగు మూలిగాడతను. లేచి కూచున్నాడు. కళ్లు నులుముకున్నాడు. భయం, సిగ్గు లీలగా అతని కళ్లల్లో మెదిలాయి.

"క్షమించండి గురూగారూ. నేను, తాగాను" అన్నాడు. నాకు నిజంగా నవ్వొచ్చింది. వంటపని ముగించుకుని, అతని దగ్గర జేరి— "నటరాజా! ఏమయ్యా, ఇదంతా?" అని అడిగాను భుజం మీద చేయినేసి. ఆడపిల్ల మాదిరి తలవాల్చుకుని, ఇంకా తాగిన మైకం ఒంటికి గిలిగింతలు పెడుతూండగా "జీవితంలో తొలిసారే తాగాను గురూగారూ! తాగాలనిపించింది. బాధ భరించలేకపోయాను.. తాగాక, మరీ బాధ కలిగింది. మిమ్మల్ని కష్టపెట్టాను. క్షమించానసండి గురూగారూ!" అని బ్రతిమాలాడు.

నేను క్షమించాననలేదు. తాగినవాడిని క్షమించలేను. మౌనంగా అతని కళ్లల్లోకి చూచాను. అతను సిగ్గుపడుతున్నాడు. చేసిన తప్పిదం వెల్లడైపోయిందే అని బాధపడుతున్నాడు.

"లే—రెండు మెతుకులు తింటే నిద్రపోతే, ఉదయానికి హృదయంలోని దిగులు పూర్తిగా హరించుకుపోతుంది"

నటరాజా గుత్తివంకాయ కూర తనకు యిష్టం లేనట్లు తినసాగాడు. రెండు ముద్దలు మింగి "ఉహుఁ! నావల్ల కాదు తిండి సయించడంలేదు" అనేసి, లేచి చేతులు కడుక్కున్నాడు. మూతి తుడుచుకుని, పక్కమీదకి జేరాడు. తింటున్నానన్న మాటేగాని, ఆలోచనల నిండా నటరాజా నిండున్నాడు. అతని గురించి చెప్పవలసి వస్తే, పూర్తిగా ఒక నవలే రాయాలి. కనీస పక్షం రెండుముక్కలైనా చెప్పకపోతే అతని వ్యక్తిత్వం తెలియదు మరి!

అతనూ నేనూ ఆఫీసులో ఒకేసారి జేరాము. దాదాపు మూడేళ్ల క్రిందట.. సర్వీస్ కమిషన్ ధర్మమా అని అటు కోనసీమనించి నేనూ, ఇటు శ్రీకాకుళం నించి నటరాజా వచ్చి హైదరాబాదులో కల్సుకున్నాము. వచ్చిన కొత్తల్లో నటరాజా నోటినించి మాటలు అత్యద్భుతంగా వినవచ్చేవి. "నంజకొడుకు" పదం లేనిది అసలు మాట్లాడి ఎరగడు. నాదైన దుర్భన సాంగత్యం వల్ల క్రమంగా అతను మామూలు మాటలు నేర్చుకున్నాడు. తొలిరోజుల్లో ఆఫీసే మాకు మోవైంది. ఆ తరువాత, తన జిల్లావాడైనవాడి సీతారాంబాగ్‌లో ఉన్నాడని నటరాజా వెళ్లిపోతే—నేను తెలుగువాళ్లు నివసించే చిక్కడపల్లిలో వేంకటేశ్వర స్వామి వారి ఆలయానికి దగ్గరగా గది తీసుకున్నాను.

నటరాజా కలిగిన యింట పుట్టినవాడు. అయినా, నాలుగేళ్ల పాటు దూరదేశవాసం చేస్తే ఒంటికి మంచిదన్న అభిప్రాయంతో కాబోలు, అతగాడు ఇంత దూరమూ ఒక చిన్న గుమాస్తాపని చేసేందుకు తరలి వచ్చాడు. వస్తూ వస్తూ గుండెల నిండా ప్రేమ నింపుకు వచ్చాడు. ఊర్లో ప్రక్కింటి అందమైన పదారేళ్ల పడుచు కమ్మని రూపాన్ని గుండెల్లో ఫోటో దించుకుని వచ్చాడు. తరచు నటరాజా చెప్పేవాడు—"మేమిద్దరమూ ప్రేమించుకున్నాం గురూగారూ! చిన్నప్పటి నించీ కలిసి తిరిగాము. గిల్లికజ్జా లాడుకున్నాం. అవన్నీ గుర్తు తెచ్చుకుంటూ ఉంటే—దీని దుంపతెగ! మనస్సు పులకించి పోతుంది సార్! అందికే గదా గురూగారూ! మేమిద్దరమూ పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాం. మావాళ్లు ఒప్పుకున్నారు. కాని సార్ ఆరోజా లుం దగ్గరవడకుండా ఉంది..." మూడేళ్ల ని అతని మాట చెబుతూనే ఉన్నాడు.

భోజనం ముగించుకుని, గిన్నెలు ప గిల పెడుతూ ఉంటే, ఒక్కసారిగా నా ఆ చన జోరగిలబడి వచ్చింది.

నటరాజా తాగాడు. అంతకు ముం న్నడూ అలవాటు లేనివాడు. అసలు మ మంటేనే ద్వేషించేవాడు తాగాడు. అం దాని వెనుక బలమైన కారణమే ఉండా నటరాజా పట్టి మనిషికాదు. నిండా ప్రేమి చినవాడు. ఈ ఆలోచన కలిగినంత మనసొక్కసారి గిలగిలలాడింది.

ఒంటి మీద తెలివి లేకుండా పడి వు అతన్ని నిద్రలేప బుద్ధికాలేదు. స్వాప్ని జగత్తులో పడి స్వర్గాన్నుంచి దిగివచ్చి క్రొత్తవేశ్యలు నననన లాడుతూ కనిపిం అతన్ని అలరించనిమ్మని, నే నొక్క నా ఆలోచనల మధ్య, మెత్తగా ఒరిగాను

మనసుకు బాధ కలిగితేనే గాని, మం మనిషి మద్యం వంక కన్నెత్తి చూడడ జరిగినదేమో సుంతైనా తెలియదు నా నటరాజా నిండుగుండెల్లో దాగిన పక్కిం పడుచు అతని ప్రేమను తృణీకరించై ఉండాలి లేదా మరే బాధైనా క ఉండాలి.బాధకంతకూ మూలకారణం మను అది తెలిస్తే, అనాదిగా మానవజాతి మన తోనే బ్రతుకులు వెళ్లబుచ్చుతున్నది.

నా ఆలోచనలెప్పుడు నిద్రపోయాన తెలియదు. బద్ధకంగా మూలిగి, మెల్లగా కనురెప్పలు తెరచి వెలుగుకన్నె భువికి దిగివచ్చిన జాడ కనుగొన్నాను. ఆవలింత వెనుక, తిరిగి కనులు తెరచా

"నటరాజా" అని పిలిచాను. జవా లేదు. లేచిచూస్తే నటరాజా జాడలేదు. అ తెల్లవారకుండానే నటరాజా నా గది నుం బయలుపడ్డాడు. ముఖం చూపడానికి సిగ పడి ఉండాలి. ఆరోజు ఆదివారంకాద శలవు రోజైనాకాదు. ప్రత్యేక కారణా వల్ల ఆఫీసు మూసివేసే ప్రమాదము లేదు. ముందుగా గ్రాంటు చేయిం కుంటేనేగాని వీలు కలుగని పరిస్థితుల నటరాజా శలవు పెట్టే అవకాశమూ లేద అతనిని ఆఫీసులోనే చూడవచ్చున కున్నాను.

నటరాజా గురించి ఆలోచనలనేకం నా బాటు ఉల్లిసాంబారు మెతుకులు జా

ఇంజక్షన్ నిద్చేన నవర్చే మందు సీసా.

కూనిరాగం ఆపి, ఆయన గొంతు తడుపు కున్నాడు. పొరమారింది. కషాయాన్ని మంచినీళ్ల మాదిరిగా సేవిస్తే గొంతు తడ బడకపోతుందా! కొంపలో ఎవరూ ఉన్న జాడ లేదు. మాధవరావు గారు మానినీ సహితంగా ఈ నగరానికి విచ్చేశారు. ఇవాళ, ఇంట్లో

వివరాలేరు. పైగా ఇరత మరిచిపోడూ కైపుకోసం స్వర్గలోక ప్రవేశం నిమిత్తం మత్తు మందును సేవిస్తూ ఉన్నారు.

"అబ్బా!" అన్నాడాయన.

సీసా చేతిలోనే ఉంది. కూచుని ఉన్న వాడు మెల్లగా వెనక్కువాలి "హాఁ..వికా రం" అని మూలిగాడు. క్రింద పారవేయ

పోతున్న తన్మయత్వ నిదానికి, క్కాని పెట్టాను. వెలికలు తిరిగిపోతున్న మని షిని మెల్లగా లేవదీసి, మంచం చేర్చబోయాను. ఆయన గింజుకుని, నా చేతుల్లోంచి బయటపడి, మంచం మీద కూర్చున్నాడు. రెండుక్షణాలు నన్ను పరికించి చూశాడు. పెదవుల పైకి

నన్ను తిట్టుకుని ... మీరు మంచివారు. నేను తప్పు చేసినవాడిని. అయ్యో! నమస్కారం మీరు వెళ్ళిపోండి" అన్నాడు, తడబడుతూ.

నేను కొంచెం దగ్గరకు నడచి, ఆయన ప్రక్కగా కూర్చుని, ఏదో అడగబోయాను.

"మిస్టర్ బాలరాజ్! వెళ్ళిపోండి! నన్నేమీ అడగొద్దు. తప్పు చేశాను. సరిదిద్దుకోడం లాభంలేదు. చేతులు కాలిన తరువాత తాగినా ప్రయోజనంలేదు. నేను కొంచెం తాగాను. గొంతు కంతా గుండెలాగా మండిపోతూ ఉంది. మీరు వెళ్ళిపోండి. తాగినవాడి దగ్గరగా కూర్చోకూడదు. మీరు కూడా కొంచెం వేసుకున్నారని జనం అనుకుంటుంది. దయచేసి మీకు నమస్కారం చెప్తాను నేను ఇంతకు ముందెప్పుడూ తాగలేదు.. నిజంగా తాగాలని అనుకోలేదు. కాని, బాలరాజుగారూ! ఏం చేయను. తాగాను, ప్లీజ్.. వెళ్ళిపోండి."

కనులు మత్తుగా మూతపడ్డాయి. ఆయన వెనక్కు వాలి, కాళ్ళు ముడుచుకుని వెక్కిళ్ళతో బాధపడసాగాడు. మరి కూచోవాలనిపించలేదు. మనసంతా ఆందోళనతో నిండిపోయింది. మానవ మనస్తత్వం ఎంత చిత్రమైనదో ఈ రోజు సరిగా గ్రహించగలిగాను. నటరాజు సంగతి అటుంచి, మాధవరావు సంగతి చూస్తే ప్రకృత్యా మంచివాడైన ఆయన, ఏనాడూ కోపమంటే ఎరగని వాడు, ఆఫీసులో ఆగ్రహించాడు. అప్పుడే అనుమానం వచ్చింది నాకు. ఎంతగా ఆరోగ్యం బాగుండకపోయినా, అంత ఆగ్రహించవలసిన పనిలేదు. ఆయన కోపగించినందుకు నాకు బాధ కలగలేదు. కాని, ఆయన మనసు చెడిపోయి ఉండాలనిపించింది. ఆయనను ఒకసారి కలుసుకోవాలనిపించింది. అందుకే రాత్రి ఏడు గంటలవేళ మాధవరావుగారిని చూడబోతే జరిగినది యిది.

చదువూ సంస్కారమూ కలిగిన వాళ్ళు సాధారణ పరిస్థితుల్లో దేవదాసులు కాలేరు. పట్టి త్రాగుడు సంగతేకాదు. దేవదాసు అసలు స్వభావమూ వాళ్ళను పట్టి పీడించదు. కాని, తను కల్పిన సంస్కారంతో తను చుట్టూ నిలబడ్డ పరిస్థితుల వెంపు చూస్తే ఏవిధంగా నడవాలో తెలియని స్థితిలో గుక్కతిప్పుకోలేక, మనసు పాడైనట్టు కన్పిస్తే, చదువునూ సంస్కారాన్ని చట్టుబండలు చేసి మూడు గుర్రాలో నాలుగు గుర్రాలతో అధిరోహిస్తారు మరి. నటరాజు

## వా క్ప మ గ్గ రం

బయిర్దాయి కాడు. మాధవరావు బాగా చదువుకున్నవాడు. ఇద్దరూ జీవితంలో మొదటి సారి తాగారు. ఎందుకు తాగారో తెలీదు. తెలుసుకుందామనుకుంటూన్నంతలో నటరాజు దూరంగా వెళ్ళిపోయాడు. ఊరికే వెళ్ళాడా!—నేరం మీదే పడ్డాడో!? మాధవరావు సంగతి బహుశా రేపు ఆఫీసులో తెలుసుకోగలనేమో!

పాపం! మంచివాళ్ళిద్దరూ ఒకరోజు తేడాతో తాగారు. అదిన్నీ, జీవితంలో మొదటిసారి. నటరాజు, ఆటు తరువాత మాధవరావు.

నడుస్తున్న వాడిని ఆగిపోయాను. వీధి దీపం కాంతి నాకళ్ళ ముందు చిత్రమైన వెలుగును కనబరచింది. నటరాజూ మాధవరావు ఇద్దరూ మంచివాళ్ళు. ఇద్దరూ జీవితంలో తొలిసారిగా, ఒకరోజు తేడాతో తాగారు. అయితే ఇద్దరూ తాగేందుకు ఒక్కటే కారణం ఉందా?

నాకు తెలియకుండానే నా ఆలోచన కొత్తదారికి నడచింది. పెదవి విరిచాను. కాకపోవచ్చు. నటరాజెక్కడ? మాధవుడెక్కడ? నటరాజు బాగా కలిగినవాడే అయినా యల్డీసీ మాత్రుడు. మాధవరావు గజెటెడ్ ఆఫీసరు. హోదాలో ఇద్దరికీ చెప్పలేనంత భేదం ఉంది మరి!

అనేం చిత్రమో నా ఊహకందని విధంగా, రోజురోజుకూ చిత్రమైన సంఘటనలే జరుగుతున్నాయి. మరునాడు ఆఫీసుకు చేరుకునే వేళకు మాధవరావుగారు రెండు నెలల పర్యంతం శలవు పెట్టారని విన్నాను. ఆంతేగాక డిపార్టుమెంటులో పూర్తిగా కాకపోయినా, ఒకింత నరకాసుర ప్రవృత్తికి పేరుబడ్డ ఆంజనేయరావుగారు మా ఆఫీసరుగా వస్తున్నారట!

మాధవరావుగారు శలవు పెట్టడమేమిటి, అంతగా మెడికల్ లీవు పెట్టడమేమిటి, ఆరోజే ఆయన హైదరాబాదు విడిచి వెళ్ళడమేమిటి, నా ఊహకందనంత సూక్ష్మ వేగంతో జరిగిపోయాయి.

ప్రశ్నలన్నీ నాలోనే నిరుత్తరంగా దాగిపోయాయి. కాగితాల కట్టల మధ్య కూరుకుని నన్నునూ మరచిపోయాను. 'కొత్త ఆఫీసరు గారు వేంచేశారు. కొద్దికొద్దిగా మా వాతావరణం మారిపోయింది. ఇదివరకల్లా ఊపిరి పీల్చుకునేందుకైనా తీరిక చిక్కేది.

ఇప్పుడా వీలుబడే రాస్తున్నాము. కాగితాల కట్టలు కొద్దీ కురుస్తున్నాయి. ప్రభుత్వం వారి ఖాతాలో కాగితాల ఖర్చు, సిరా వినియోగపు రుసుము పెరిగాయి. ఇంటికి ఫైళ్ళు మోసుకొస్తున్నాను. ఎన్నెన్నో మహజర్లకు జవాబులు రాయవలసి వస్తున్నది. రోజుకు ఇరవై నాలుగ్గంటలు మాత్రమే ప్రసాదించినవాడిది తప్పైంది. నా ప్రమేయం యిసుమంతైనా లేకుండానే ఏప్రిల్ వెళ్ళి మే వచ్చింది.

* * *

"బాలరాజు గారికి—

నమస్కారాలు. ఇన్నాళ్ళుగా మీనుంచి ఉత్తరం వస్తుందని ఎదురు చూచాను. కాని, తాగినవాడిని మీరు క్షమించలేరని గ్రహించాను. ఏ పరిస్థితుల్లో నేను నా మనస్థిమితాన్ని కోల్పోయానో తెలియజేయ వలసి ఉన్నందున, ఈ ఉత్తరం రాస్తున్నాను.

నన్ను మనిషిని చేసింది మీరు. బ్రతికినంతకాలమూ దీపం పెట్టగానే మీపేరు తలచుకోవలసినవాడిని. జీవితంలో ఒక్క సారి తాగితేనేమి రోజూ తాగితేనేమి? తప్పు చేశాను. నా గుండెల్లో చెలరేగిన బాధను అణచుకోలేకపోయాను. నన్ను మనిషిని చేసిన మనిషితో నా ఆవేదన చెప్పుకోవాలనిపించినా, విని నవ్వుతారని క్షింది, కడుపు నిండా తాగి—నా బాధ మరచి పోవాలని ప్రయత్నించాను.

నేను ప్రేమించాను. 'కాని, నా ప్రేమ కథ అబద్ధం. నా గుండెల్లో ఒక అమ్మాయి బొమ్మను నిలుపుకోవడం నిజం. కాని, మా పెళ్ళి అసత్యం. ఊహ తెలిసినప్పట్నించీ మేము భార్యాభర్తలమే. కాని, ఆపిల్ల పెద్ద దిగి, నలుగురిలోనికి రావడానికి ఆ పెద్ద తనం ఆటంకమైనప్పటి నుండీ మా ప్రేమ కథ ఒకింత మారిపోయింది.

నా చిన్నతనంలోనే మా నాన్న స్వర్గానికి వెళ్ళిపోయాడు. చెట్టంత తల్లి వెడుదారి తొక్కింది. ఒక్కగానొక్క కొడుకు ఉరి పోసుకు చచ్చినా ఫరవాలేదనుకుంది. లోకానికి ఎదురు నడిస్తే, జనం హర్షించదు మరి! చేతులు కాలాక, మా అమ్మ తనే ఉరిపోసుకుంది. ఒంటరివాణ్ణి. ఉక్కిరి బిక్కిరయ్యాను. సమయానికి మేనమామ నన్నాదుకున్నాడు. ఆయనాస్తిపరుడు కాదు. పెళ్ళి పెటాకులూ లేనివాడు. అయినా, నా బాధలో పాలుపంచుకున్నాడు. నాకన్నీళ్ళు

అలమటించిపోతే, పండంటి జీవితం పాడు చేసుకోగలవని హెచ్చరించాడు. అయినా ఏం చేయగలను? కొండంత ఆస్తినీ ఏమైనా చేయమని ఆయన కప్పగించి, వాతావరణం మారితే మనసు కాస్త కుదుట బడుతుందని హైదరాబాదు వచ్చి, ఉద్యోగంలో చేరాను. అదే నా బ్రతుకును మరింత చీకటి పాలు చేసిందేమో!

నేను ప్రేమించిన పిల్ల పేరు పద్మ. ఆమె తండ్రికి నామీద అంతవరకూ అభిమానమే ఉంది. జరిగిన గాథ ఆయనగారి అభిప్రాయాలను తలకిందులు చేసింది. నాకు కొంచెమేనా తెలీకుండానే కూతురు పెళ్లి జరిపించాడాయన. పెళ్లైన కొంతకాలానికి నాకు తెలిసింది. మనసు రాయి చేసుకున్నాను. అయినా నా ప్రేమను చంపుకోలేదు. నా ప్రేమ కథను మామూలు రూపంలోనే మామూలు మాటలతోనే నలుగురికీ చెప్పుకోడం మానలేదు. ఆవిధంగానైనా కొంత సంతృప్తి పొందాలని ఆశించాను. తల్లి పాడు పని చేసి, ఉరిపోసుకు చచ్చింది. ప్రియురాలు పరాయిదైంది. అయినా చిరునవ్వులు పెదాలపై నిలుపుకున్నాను.

మళ్లీ పద్మ నాకళ్లబడుతుందని అనుకోలేదు. ఏపిల్లమీద బాల్యం నుంచీ కలలు [illegible] ఆ అమ్మాయి మళ్లీ నాకళ్లబడి నన్ను రెచ్చగొడుతుందని ఊహించలేదు. ఆరోజు ఫైలు తీసుకుని ఆఫీసరుగారి యింటికి వెళ్లాను. తలుపు తెరచి, "ఎవరు కావాలి"వి అడిగింది పద్మ. మూడేళ్ల లోనూ నాలో చెప్పలేనంత మార్పు వచ్చింది. అందుకే పద్మ నన్ను గుర్తుపట్టలేదు.

"పద్మగారికి నమస్కారం" అన్నాను. ఆమె నన్ను గుర్తించింది. తడబడలాడింది. తలుపు వేసుకోబోయింది. నాకు కోపం వచ్చింది. రెచ్చిపోయాను. అవును మరి. చిన్నతనం నుంచీ కలలు గన్న వాళ్లంతే నా దురదృష్టం కొద్దీ ఆమె నాకు కాకుండా పోయిందే అనుకోండి! కనీసం కనిపించినప్పుడైనా నా కన్నీళ్లు తుడవవచ్చు గదా! అది పోయింది. ముఖం చూపేందుకైనా ధైర్యం చాలక తలుపు వేసుకోబోతే—నేను అన్నానుగదా—"మీనాన్న మనకు అన్యాయం చేశాడు. ఆ అయ్య కూతురువనిపించావు నువ్వు" అని.

పద్మ పాపం! అబల. ఏం చేస్తుంది? అన్నది.

నాకు కలిగిన ఆవేశంలో ఆమె ఏమంటున్నదీ గమనించలేదు నేను. "రెండు నిండు హృదయాలను విడదీసిన పాపం మీనాన్నకు తగులకపోదు. చిన్నప్పట్నించీ నీతో కలిసి బతికినవాడిని. ఎన్నో ఏళ్ల తరువాత కనిపించావు. కనీసం రెండుమాటలు నాతో మాట్లాడు" అన్నాను.

పద్మ నోరు విప్పలేదు. గుడ్ల నీరు కక్కుకుంటూ లోపలకు వెళ్లిపోయింది. అక్కడ నేనింక నిలబడలేకపోయాను. నా గుండె మండిపోతూ ఉంది. నా ఆలోచనలు చచ్చిపోయాయి. ప్రపంచంలో నాకు మరెవ్వరూ జ్ఞాపకం రాలేదు. దేవదాసునైనాను. ఆరాత్రి మా గదిలో నిద్రపోయాను. ఒక రాత్రి వేళ మెలకువ వచ్చి, తెల్లవారితే మీకు మొగం చూపించలేక, ఆ నగరంలో మరి బ్రతకలేక, రాజీనామా పత్రం ఆఫీసులో ప్యూన్‌కు అప్పగించి, స్వగ్రామానికి వచ్చాను. స్థిరుడు కాదనుకున్న మేనమామ ఇక్కడి వ్యవహారాలన్నీ సక్రమంగా నడుపుతున్నారు.

పద్మ సుఖంనే కోరుతాను. అందుకే హైదరాబాదు విడిచి వచ్చేశాను. గుండె మండి పోతూ ఉంటే, ఆ బాధ భరించలేక గొంతు మండే విషాన్ని తాగిన నన్ను క్షమించండి. మన మైత్రి కలకాలం నిలవాలెనని కోరుకుంటున్న ఈ మిత్రుడిపై కనికరం చూపి ఎప్పుడైనా ఒకసారి మా పల్లెసీమకు దయచేసి, నా ఆతిథ్యాన్ని స్వీకరించండి..."

ఉత్తరంలో యింకా ఏమేమో రాశాడు నటరాజు. ఇన్నాళ్లుగా అతని చిరునామా తెలిసీ, ఉత్తరం రాయలేని నా అశక్తతను నిందించుకున్నాను. మనసిచ్చిన మంచి మిత్రుడి బాధలో పాలుపంచుకోలేని నా జీవితం కాల్చనా అని నన్ను నేను తిట్టుకున్నాను.

ఉత్తరానికి జవాబు ఏవిధంగా రాయాలో తెలిసింది కాదు. అంతటి మంచివాడి బాధను పంచుకోలేని నేను, సిగ్గుపడడం తప్ప, మరి ఏముఖం పెట్టుకుని జవాబు రాయగలను? నటరాజు ఎందుకు తాగాడో తెలిసింది. అయితేనేమి, మాధవరావుగారి సంగతి ప్రశ్నగానే మిగిలిపోయింది.

ఆ ప్రశ్నకు సమాధానం దొరికేందుకు కాబోలు, "అవసరం పడింది. నీ వొకసారి యింటికి రావాలి" అన్న నాన్నగారి అభ్యర్థనను కాదనలేక, పదిరోజులు శలవు పెట్టి



'కాశీకి బయలుదేరాను.

భాగ్యనగరంలో బయలుదేరిన రైలు బండి వన్నేగాక నాబోటి వారి నెందరినో తరగతులవారీగా తనలో ఎక్కించుకుని, చిన్నపిల్లాడి మాదిరి "చుక్ చుక్"మంటూ అక్కడక్కడ ఆగుతూ, కొందరిని దించి వేస్తూ మరికొందరిని ఆకర్షిస్తూ— ఆడుతూ పాడుతూ విడదవోలుకు చేరు కుంది.

చేతిలో సంచీతో బండి దిగి, ప్లాటుఫారం మీద అడుగు పెట్టానో లేదో, సిమెంటు బెంచీ మీద బెంచీ అంతా తనదే అన్నట్లు బోరగిలపడి పడుకున్న మనిషి నన్నాకర్షిం చాడు. బండీ ఆగి, కలకలం రేగగానే అతను లేచి కూచున్నాడు. నిండాగడ్డం పెంచుకున్నవాడు, మాసినబట్టలు ధరించిన వాడు, చూపు మాత్రం గానే ఆయనెవరో ఆనవాలు కట్టేందుకు సాధ్యంకాని విధంగా సాక్షాత్కరించినవాడు. ఆయన మాధవ రావు. నన్ను చూచాడు. చూస్తూనే, అసహ్యంగా తయారైన, వాడిపోయిన ముఖం మీదికి చిరునవ్వును తెచ్చుకుని, "బాల రాజుగారూ!" అని పిలిచాడు. ఆయన మాధవరావు గారో కాదో అన్న అనుమానంతో అడుగు ముందుకు వేయబోతున్నవాడిని, ఆగి—"క్షమించండి సార్! మిమ్మల్ని గుర్తు పట్టలేకపోయాను" అన్నాను. పేలవమైన ఆయన చిరునవ్వు 'నీతప్పులేద'ని నన్ను సమర్థించింది. ఇద్దరం ఆ బెంచీ మీదనే కూచున్నాం. పాపం ఆయనను చూస్తూ ఉంటే కడుపులోంచి బాధ రేగింది.

వాళ్ళు ముగ్గురు......

"చెప్పండి—ఏమిటి ప్రయాణం?" అని, ఆయనే అడిగాడు.

నేను సమాధానం చెప్పబోతూ ఉండగా, గొంతు [illegible]డింది. ఇద్దరం ముందుగా ప్లాటుఫాం టీ సేవించాము. నా ప్రయాణం సంగతి చెప్పకుండానే ఆయన మాట్లాడడం ప్రారంభించాడు.

"అర్థరాత్రి మీరు నన్ను చూచేందుకు వచ్చారు. ఆఫీసులో మీపై చిరాకు పడ్డా నని మీమీద కోపంలేదు. మీరు మంచివారని నాకు తెలుసు. అందుకే, తాగిన ఆవే కంలో కూడా, మీ ముందు నిలబడడం సిగ్గనిపించి, వెళిపొమ్మని అర్ధరాత్రి ప్రాధేయ పడ్డాను. మళ్ళీ కనిపిస్తే, నా మనసు లోని బాధనంతా మీ ముందు వెళ్ళబోసు కోవాలనుకున్నాను. ఆరోజు ఇన్నాళ్ళకు వచ్చింది..."

ఆయన ఆగి, నా ముఖం వంక చూచాడు. నా మనసు బాధలను భరించేందుకు అల వాటు పడ్డదికాదు. కష్టాల మధ్య నిలబడ్డ మనుష్యులను చూస్తే గుండె నీరైపోతుంది. మాధవరావు గారు చెప్పబోయే కథను ఊహించుకోలేక ఉక్కిరిబిక్కిరి కాసాగారు. కథ లనేకం చదివిన వాడిని. కథేతి వృత్తాల విచిత్ర పోకడలకు ఆశ్చర్యం పొందిన వాడిని. ఇవాళ అన్ని కధలూ పేలవమై నిలబడ్డాయి.

ఆయన చెప్పసాగాడు.

"వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారని నాకు తెలియదు. కనీసం పెళ్ళైన తరువాతైనా పద్మావతి నాకు చెప్పి ఉండవలసింది. మన దౌర్భాగ్యం కొద్దీ ఆడవాళ్ళ మనస్సులు అంత ఎత్తుకు పెరగలేదు. చూచాయగానైనా వాళ్ళ ప్రేమ సంగతి నాకు తెలియజేస్తే నేను వాళ్ల సుఖాన్ని కాంక్షించి ఉండేవాడిని. పద్మావతి మంచిపిల్ల. అయితేనేమి మన సులో ఈ విషయం దాచుకోవడాన్ని నేను సహించలేకపోయాను. వాళ్ళిద్దరికీ—మనః పూర్వకంగా గాకపోయినా ఇంత మనః క్లేశాన్ని కలిగించడం చాలా తప్పిదం అనిపించింది. చేసినది చాలు. ఇంతకాలమూ వాళ్ళని దూరంగా ఉంచి, పాపం చేశాను. రేపు భగవంతుని ఎదుట చేతులు జోడించి, "నాకు తెలియకనే ఈ తప్పు చేశాన"ని చెబుతాను. అందుచేతనే, ఆ మరుక్షణం లోనే పద్మావతికి నచ్చచెప్పాను. 'ప్రేమించు కున్న వాళ్ళిద్దరి మధ్య నన్ను మరి నిలబడ నీయవద్ద'ని బతిమాలాను. మనసులు కలసిన వాళ్ళు, పసితనం నుంచీ భార్యా భర్తలుగా పెరిగినవాళ్ళు, కలసి జీవించ డమే మంచిదని బుజ్జగించి చెప్పాను. నా కోరిక విని పద్మావతి మరునాటి సాయంకాలం వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ చిలకాగోరింకల్లాగా కలకాలం సుఖంగా బతకాలనని ఆశించాను. తప్పా! మీరు చెప్పండి!!"

నేను ఏమీ చెప్పలేకపోయాను. నా కళ్ళల్లో నీళ్ళు గిరున తిరుగుతూ ఉన్నాయి. ఇంత మంచిమనిషి ఎంత వేదన ననుభవిస్తున్నాడో అనుకుంటూనే ఎంతో బాధ కలుగుతున్నది.

"కాని, బాలరాజుగారూ! అందరిలాంటి మనిషిని నేను. నాకూ మమత ఉంది. నా భార్యను మనసార ప్రేమించాను. ఏం చేయను? నా దురదృష్టం కొద్దీ ఆమె నాకు దూరమైంది. ఆమెలేని జీవితాన్ని ఊహించుకోలేక, ఆమె వెళ్ళిన నాటి రాత్రి గుండెలు మండే బాధతో సీసా ఖాళీ చేయ డానికి కూచున్నాను. అలవాటు కాని ఔషధ సేవనం. అంతలో మీ రాక. ఇదీ కథ. ఈ కథ మీరు చెప్పి, నాగుండె బరువు కాస్త తగ్గించుకోవాలనుకుంటే సమయమే చిక్కలేదు."

ఇంతలో బెజవాడకు బయలుదేరిన బండి, నరసాపురం నుండి వచ్చి, ఆగింది. ఆయనకు కనీసం ఊరడింపు కోసమైనా నాలుగు మాటలు చెబుదామనుకున్నాను. దుఃఖంతో గొంతు పూడుకుపోయింది... మాటలే కరువైపోయాయి.

"వెడతాను బాలరాజుగారూ! బెజవాడలో మా చెల్లాయి ఉంది. ఆమె దగ్గరైనా నాకు కాస్త మనశ్శాంతి లభిస్తుందేమో నన్న ఆశతో బయలుదేరాను. భగవంతుడు మేలుచేస్తే, మళ్ళీ కలుసుకుందాం. మీ మిత్రుడికి నా శుభకాంక్షలు తెలియ జేయండి."

ఆయన వెళ్ళిపోయాడు. నాలో దుఃఖం మిగిలింది. మనశ్శాంతి కోసం ఆయన యిన్నాళ్ళుగా, ఇట్లా తిరుగుతూ ఉన్నా డేమో!! రెండుక్షణాల పిదప, నా ఆలోచ నలు విచిత్రమైన ఫణితితో కలవరమం దాయి. పద్మావతి—అవును, పద్మావతి.

* * *

నీరెండలో నాసీడ చాల పొడుగెదిగింది. కొత్త ప్రదేశంలో, చిరుగాలికి, నా నుదు టిపై ముంగురులు కొత్తగా కదలాడు తున్నాయి. రావి చెట్టు దగ్గర నిలబడి, రెండుక్షణాలు ఎవరైనా కన్పిస్తారేమోనని చూచాను. అల్లంత దూరాన పదేళ్ళ కుర్రాడు మాత్రం నావైపే వస్తూ కని పించాడు. అతను నావంక విచిత్రంగా చూచి—"ఏ ఊరండీ మీది" అని అడిగాడు. చిరునవ్వుతో అబ్బాయి ప్రశ్నను త్రోసి పుచ్చి, "నటరాజుగారి యిల్లెక్కడో కాస్త చూపిస్తావా?" అని అడిగాను.

అతని వెనుకను నలభై గజాలు నడిచి పిదప అమాంతం నన్ను నటరాజా కౌ లించుకున్నాడు.

"గురూగారూ! నన్ను క్షమిస్తారని కలలో కూడా అనుకోలేదు. నా మీద దయ తలచి వచ్చారు. వస్తున్నానని ఒక్క కార్డుముక్క రాస్తే ఏం పోయింది సార్! రెక్కలు కట్టుకుని రైలుస్టేషన్‌కి వచ్చే

ఈ భూమ్మీద తన గుండెతో విలువు కట్టి అందమైన అమ్మాయికి యింతకంటె మహోపకారాన్ని చేసి ఉండడు."

ఆ రాత్రి నటరాజా పసిపిల్లవాడి మాదిరి నా కడుపుతో తలదాచుకుని, పిడుసగా నిద్రపోయాడు. తెల్లవారి లేస్తూనే — చిరునవ్వుతో "రాకరాక మా యింటికి వచ్చిన మీకు నేనిచ్చే ఆతిథ్యం యిదేనా లేవండి. గురూగారూ! ఈ రోజంతా బ్రతుకులోని భారాన్ని గాలికి వదిలివేసి, చిన్నపిల్లల మాదిరి ఆడుకుందాం" అన్నాడు.

ఆశ్చర్యమైంది. రాత్రంతా ఏకధారగా ఏడ్చిన వాడికి ఇంత గుండె నిబ్బరం ఎక్కడ నుంచి వచ్చింది. ఎంతటి దుఃఖాన్నైనా కొనగోటితో మీటగల ఆత్మశక్తి నటరాజా కెలా వచ్చింది?

ఒక్కక్షణం మానవసహజమైన అనుమానం ప్రవహించింది. ఒకవేళ పద్మావతి నటరాజా దగ్గరకే వచ్చిందేమో! ప్రస్తుతం ఆమె నటరాజాతోనే ఉంటున్నదేమో! ఈ విషయం నాకు తెలియకుండా ఉండేందుకు గాను ఇంత దుఃఖమూ — ఇంత ఆత్మ దూషణమూ నటనలోని భాగాలేమో! ఈ ఆలోచన సాగుతూనే ఉంది ఆ రోజంతా. రాజ ప్రాసాదం వంటి ఆ కొంపలో ఆడవాళ్ళెవరూ కన్పించలేదు. ఫోటోలోని పద్మ ముఖం ఆ యింట్లో ఏమూల నుండైనా తొంగి చూడగలదని ఆశించాను. అయినా, అంత మంచివాడు నాముందు ఏ ఫలితాన్ని ఆశించి యిలా నాటకమాడుతాడు అనికూడా అనిపించింది. ఉండబట్టలేక అడిగేశాను.

నా ప్రశ్న విని నటరాజా నవ్వాడు. కోపగించలేదు. నవ్వుతూనే చెప్పాడు "మూడేళ్ళ పర్యంతం మీ అడుగుజాడల్లో నడిచిన మిమ్ము ఇట్లా అనుమానించడం భావ్యం కాదు. మీరు చెప్పేవన్నీ కథల్లో సంగతులు. మనిషి బతుకును కథతో ముడిపెట్టకండి. బతికున్న వాళ్ళ జీవితాలెప్పుడూ కథలు కావు. మీరు చెప్పేవరకూ పద్మ సంగతి తెలీదు నాకు. దాదాపు పద్మను మరచిపోవాలని ప్రయత్నం చేశాను. మరచిపోయాను కూడ. మీరు వచ్చి, కథ చెప్పి, కన్నీళ్ళు తెప్పించారు. ఇప్పుడు మళ్ళీ మరో విధంగా కథను మారుస్తున్నారు. గురూగారూ! మీరేమైనా అనండి. నేను మీ శిష్యుణ్ణి"

బ్రతుకులోని భారాన్ని వదలి, ఆ రోజంతా హాయిగా గడపదలచిన నటరాజా ముఖంపై అపగలంతా చిరునవ్వు చెరిగిపోలేదు. తోటల్లో పడి పరుగులెత్తాము. మామిడిపళ్ళ మూటా చూశాము. జామిపళ్ళు తిన్నాం. మోటు బావి దగ్గర కూర్చుని నటరాజా అందమైన తన సన్నని గొంతెత్తి చక్కని పాటలు పాడాడు.

సన్నగా చీకటి పడుతున్న వేళ, యింటికి తిరిగి వస్తూ ఉండగా — "గురూగారూ! నన్ను అనుమానించినందుకు బాధలేదు. కాని, ఆ విధంగానైనా అయితే ఎంతో సంతోషించేవాడిని. కొండంత సంబరంతో పద్మను సమాహ్వానించి, నా అర్ధాంగిగా చేసుకునేవాడిని. ఆమె నా దగ్గరకు రాలేదు. రాదు కూడా. తండ్రి దగ్గరకే చేరి వుంటుంది." అన్నాడు నటరాజా.

ఆ విషయం మళ్లీ ప్రస్తావనకు రాలేదు. ఆ మరునాడు నేను బయలుదేరే వేళనైనా అతను పద్మ విషయం చెప్పలేదు. అతనిలో ఆసక్తి పెంచేందుగ్గాను — "నేను కోనసీమకు వెడుతున్నాను." అని చెప్పాను. అయినా, అతను పద్మ విషయమై ఉత్సాహం చూపలేదు. తన మామూలు ధోరణిలో నటరాజా నాకు వీడ్కోలిచ్చాడు.

మాధవరావు తెలిసి చేసినా, తెలియక చేసినా రేపు భగవంతుడి ముందు మోకరిల్లి తప్పు చేశానని చెప్పుకునేందుకు భయపడ్డాడు. నటరాజా మనిషి అంతర్యాన్ని నమ్మి, తెలిసి తప్పు చేయకుండా జాగ్రత్త పడ్డాడు. ఇద్దరూ చిత్రమైన మంచివాళ్ళు.

అక్కడి నుండి బయలుదేరి, సరాసరి అమలాపురం చేరుకున్నాను. నాతో మిగిలిపోయిన ప్రశ్నకు సమాధానం తెలుసుకునేందుకు పద్మ తండ్రి రంగారావు గారు పని చేస్తున్న పాఠశాలకు వెళ్లాను. ఆయన నన్ను చూస్తూనే గుబురు మీసాలపై చిరునవ్వును వెలయించి, "ఏం నాయనా! నా పేరే రంగారావు. ఏంకావాలి?" అని అడిగాడు.

"హైద్రాబాదు నుంచి వస్తున్నాను. మాధవరావు గారు మా ఆఫీసరు" అని మాత్రం చెప్పాను.

నా మాటలు వింటూనే ఆయన ముఖం కందగడ్డ అవుతుందనుకున్నాను. ముఖమింత చేసుకుని, "ఏం నాయనా! మావాళ్ళు క్షేమంగా ఉన్నారా? మా అమ్మాయి నాకు చెప్పమని ఏం కబుర్లు చెప్పింది" అని నా గుండెల్లో రాయి పడింది. ఏ అనుమానం నా నవనాడులనూ కృంగదీసిందో, అది నిజమైపోయింది. ఆ కన్నతండ్రికి ఈ కథంతా ఎట్లా చెప్పేది? నాకు నోరాడలేదు. మానవత్వం పైకి నవ్వు తెచ్చుకుని, "అంతా క్షేమం అని చెప్పమన్నారు. ఏం విశేషాల్లేవు. మరో పది రోజుల తరువాత హైదరాబాదు వెడతాను. వెళ్ళేముందు తప్పక కనిపిస్తాను" అని చెప్పేసి, బయటపడ్డాను.

పద్మావతి భారతదేశంలో పుట్టింది. ఆనాదిగా ఈ దేశంలోని మానిని మనస్తత్వమే ఆమెకు అలవడింది. పసితనం నించీ నటరాజాను ప్రేమించింది. అయితే నేమి, తండ్రి తన బాగుకోరి, మంచి సంబంధాన్ని ఏరి కోరి తెస్తే ఆయన మాటను కాదనలేక, మనసులోని ప్రేమమూర్తిని మరచిపోయి, మాధవరావు నీడను చేరుకుంది. ప్రేమ విచిత్రమైన గుణం గలది. వివాహిత భర్త వినా పరపురుషుని సంగతి యోచించ కూడదు. పద్మావతి భర్తను దైవంగా ఎంచి, ఆయనను ప్రేమించేందుకు ప్రయత్నించింది. నటరాజా ప్రవర్తనవల్ల ఆమె జీవితోద్యానవనంలో వడిగాలి వీచింది. మాధవరావు మంచివాడు. సహృదయంతో ఆ ప్రేమికుల సుఖాన్ని కోరాడు. కాని, పద్మ అంతర్యాన్ని గ్రహించలేకపోయాడు. తండ్రి తన అభీష్టానికి అనుగుణంగాని సంబంధం తెచ్చినపుడు ఎట్లా ఎదురు చెప్పలేకపోయిందో పద్మావతి యిప్పుడూ అదేవిధంగా భర్త మాటకు ఎదురు చెప్ప లేకపోయింది. కాని నటరాజా ఆమె హృదయంలో లేడు. అతని వద్దకు ఆమెకు వెళ్లలేకపోయింది. అంతేగాక — భర్తకూ తనకూ ఒకగొప్ప విభేదాన్ని కల్పించిన నటరాజాను ఆమె క్షమించలేకపోయింది. పోగా, తండ్రి దగ్గరకు ఏ ముఖం పెట్టుకుని తను వెళ్ళగలుగుతుంది. తల్లి పోయిన ఆవేదనకు తోడు తను కొత్త బాధను ఆయనకు కలిగించలేదు. అందుకే ఆమె అయినవారికి దూరంగా నడిచింది.

వాళ్ళు ముగ్గురిదీ మూడు విచిత్రమైన మనస్తత్వాలు. గుర్రబ్బండిలో కూచున్న ఒక నిట్టూర్పు విడిచిపుచ్చాను. మంచివాళ్ళ జీవితాలు యిట్లా కథలైతే వాళ్ళకు కలిగిన బాధ అటుంచి, ప్రేక్షకుణ్ణిగా అమితమైన బాధ ననుభవించవలసి వచ్చింది. ●

# వారఫలం

18-11-1966 శుక్రవారం మొదలు
24-11-1966 గురువారం వరకు.

**మేషం**: వారం ప్రారంభంలో అన్నివ్యవహారాలు అనుకూలంగానే ఉంటాయిగాని వారాంతంలో చికాకులు యేర్పడతాయి. ఆర్థికవ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో ప్రముఖపాత్రను నిర్వహించగలరు. దైవకార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం**: వృత్తివ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు: కుటుంబవ్యవహారాలు సామాన్యంగా వుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిథునం**: వారం ప్రారంభంలో వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలించగలవు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. మానసికాందోళన కలుగుతుంది.

స్త్రీలకు: ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభించగలదు.

**కర్కాటకం**: ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. ఏవ్యవహారంలోనూ విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. ఉద్యోగంలో మీకంటే తక్కువ వారే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు:— కుటుంబవ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సింహం**: వృత్తివ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేదిమరొకటి కాగలదు. ఆర్థికవ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. దూరప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య**: వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలించగలవు. వృత్తిలో పోటీవారితో పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణించగలదు. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబకార్యక్రమాలు బాగా కంగా నెరవేరతాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**తుల**: ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సఫలంగా నెరవేరతాయిగాని, మీస్వంత పనుల్లో శ్రమ కలుగుతుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటానికి లొంగిపోవడం తగదు. ఉద్యోగంలో మీమంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలు ఫలించగలవు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగురాండ్రకు మంచి సమయం.

**వృశ్చికం**: వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. బంధువులకుసహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. సంతోషకరమైన వార్తలువింటారు.

**ధనుస్సు**: రావలసిన డబ్బు సమయానికి అందడం వలన అన్నివ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో మిత్రుల సహకారం లభించగలదు. సాంఘిక కార్యక్రమాల్లో మీప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం**: వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగి పోతాయి. ఉద్యోగంలో యితరులకు ఉపకారంచేయడానికి ప్రయత్నించడం వలన శ్రమకు గురి కాగలరు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణించ గలదు. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**కుంభం**: మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటె భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వారంప్రారంభంలో మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరం. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**మీనం**: ఈవారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో వారం మధ్యలో స్వయం ప్రయాసలు కలుగుతాయి. కొన్ని వ్యవహారాల్లో మిత్రులే మిమ్మల్ని వ్యతిరేకించ గలరు. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు తలయెత్తగలవు. వారం ప్రారంభంలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్


ఇంట్లో ఉతికినది
సర్ఫ్‌తో
ఉతికినది
Surf
AMAZING BLUE POWDER
FOR THE WHITEST WASH!

# ప్రయాణము



పాలడుగు వెంకటేశ్వరరావు

నల్లగా చీకటి దుప్పట్లా పరుచుకుని ఉన్నది. ప్రక్క ఇంటి వాళ్ళ గడియారము పదకొండు గంటలు కొట్టింది. ప్రయాణానికి తర్జిన సామాను, 'హాలు'లో పెట్టారు. వెనుక వరండాలో చాప పరుచుకుని పడుకుని సౌభాగ్యమ్మ నిద్రపట్టక, అటూ ఇటూ దొర్లుతూ ఉన్నది. హాలులో శేషగిరి కూర్చుని, ఉత్తరాలు రాసుకుంటున్నాడు అప్పటివరకూ.

ఆ ఉదయం జరిగిన సంఘటన జ్ఞాపకము వచ్చింది సౌభాగ్యమ్మకి. కనుల వెంట నీరు ఊరింది, ఆమెకి. నిస్సహాయముగా ఆ అవస్థకి లోనయినది సౌభాగ్యమ్మ! శేషగిరి ఇంతగా మారిపోయినాడు?!

శేషగిరి తనని లలిత ముందూ, భూషణం ముందూ అన్నమాటలు ఇంకా గుండెల్లో మ్రోగుతూ, 'కలచి' వేస్తూనే ఉన్నాయి సౌభాగ్యమ్మకి. నౌకర్నని అన్నట్టు అన్నాడు తనని. సౌభాగ్యమ్మ అప్పుడు తెల్లపోయి చూస్తూ నిలబడిపోయింది, కన్న కొడుకే అట్లా అంటూ వుంటే. అప్పటి దాకా ఇంట్లో లలితా, శేషగిరి మర్యాద పడినారు.

చికాకుగా ధుమ ధుమలాడుతూ ఉన్న మొహముతో బయటికి వచ్చి తనకి ఎదురుగా నిలబడిపోయేడు, బల్లకి ఆనుకుని శేషగిరి.

లలిత సన్నజాజిపూలు కోస్తూ వున్నట్టు నటిస్తూ ఒకచెవి ఇటే పారేసి ఉంచింది. పీధరుగు మీద చుట్ట కాల్చుకుంటూ ఉన్న భూషణము రెండుచెవులూ రిక్కించేడు. శేషగిరి మళ్ళీ అన్నాడు. "ఇదేమీ బాగా లేదమ్మా! అందరూ రమ్మంటూ ఉంటే అలా మొండికెత్తడము నీకూ బాగా ఉందా? ఆమధ్యన ఎవరో పోతూవుంటే నీకూ చూడాలని ఉందని అడిగితివి. ఏవో ఇబ్బందుల వలన అప్పుడు వీలు కాలేదనుకో. ఇప్పుడు అంతా కలిసి వెడుతూ వుంటే నువ్వు రానంటావు ఏమిటి?"

రెండు నిముషాలు అట్లాగే నిలబడి నాడు శేషగిరి, సౌభాగ్యమ్మ జవాబు కోసము చూస్తూ. సౌభాగ్యమ్మ మౌనంగానే నిలబడి పోయింది. ఈ మధ్యన, కొడుకు మొహం లోనికి చూడటానికే ఆమెకి అయిష్టముగా ఉంటున్నది.

"నీకుకూడా అందరితోబాటు టిక్కెట్టు కొంటున్నాను." అనేసి గబగబా నడిచి బయటికి వెళ్ళిపోయాడు శేషగిరి.

లలిత (ఇదంతా విని) నవ్వు నణాచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది, పూలు తీసుకొని. భూషణంగారు చిన్నగా దగ్గారు సంతోషము సూచిస్తూ, అరుగు మీద నుంచి.

అసలు, ఆ విషయము శేషగిరే తనతో స్వయంగా చెబుతాడని ఆశించినది సౌభా

గ్యమ్మగారు. కాని అటువంటిదేమీ జరుగ లేదు. శేషగిరే, అడిగి వుంటే తను కాదనేదే కాదు.

లలితే చెప్పింది. శేషగిరి నెల్లాళ్ళ సెలవు పెట్టాడట! ఆ నెల్లాళ్ళూ దక్షిణాదిన చూడవలసిన ప్రదేశాలూ పుణ్యక్షేత్రాలు చూసి రావాలనుకుంటున్నారట! సౌభాగ్యమ్మ గారికి పిల్లల 'ఝంఝాటము' ఉండటము చేత తీసుకెళ్ళ కూడదని ముందు అనుకున్నారట శేషగిరీ, భూషణమూ. కాని 'ఆవిడ మాత్రము ఎప్పుడు చూస్తుంది?' అనటాన్ని, తను పట్టు పట్టటము వలన వొప్పుకున్నారట!

పిల్లల్ని ఇద్దరినీ వాళ్ళ తాతగారి దగ్గర దిగవిడిచి రావటానికి నిశ్చయమయిందట!

ఈ మాటలు విన్నాక సౌభాగ్యమ్మ హృదయము కొంచము కుదుట పడింది, ఒకరకముగా.

రెండురోజుల క్రితమే శేషగిరి, రఘున్నీ, రాణినీ, తనతో తీసుకెళ్ళాడు. వాళ్ళ బట్టలవీ కూడా సర్దించి తీసుకెళ్ళడము, సౌభాగ్యమ్మకి ఆశ్చర్యం కలిగించింది! కాని ఆవిడకి అసలు సంగతి, ఎవరూ చెప్పనే లేదు. పిల్లలకి కూడా తెలిదేమో! వాళ్ళూ, సౌభాగ్యమ్మతో అనలేదు. "అయితే వాళ్ళని, ముసలాయన దగ్గర ఉంచారన్నమాట! అదీ ఒకరకంగా మంచిదే" అనుకుంది సౌభాగ్యమ్మ. లలిత దొంగమాటలకి లోలోన నవ్వుకుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? మాకూ కష్టమేగదా!" అంది లలిత. సౌభాగ్యమ్మ మౌనంగా ఉండిపోయింది. ఏదో గొణుగు కుంటూ, లలిత వెళ్ళిపోయింది. లలిత కోపం నసాళాని కంటింది. నిజానికి సౌభాగ్యమ్మకీ వెళ్ళాలనే ఉన్నది. మామూలుగా ఇటువంటి విషయము విని ఆవిడ ఎంతో ఆనందపడి, వెంటనే తన అంగీకారం తెలిపి ఉండాలిసింది. కాని ముభావంగానే ఉండి పోయింది ఆమె. దానికి బలమైన కారణం ఉన్నది. అసలు, ఆ రోజు సాయంత్రము, ఆ మాటలు సౌభాగ్యమ్మ చెవిని పడి ఉండక పోతే ఆమె సంతోషపూర్వకంగా అంగీకరించే ఉండేది. అవసరం మీద ప్రక్క ఇంటికి వెళ్ళి తిరిగి వచ్చింది సౌభాగ్యమ్మ ఆ సాయంత్రము.

'పడమటింటి'లో నుంచి మాటలు వినిపించాయి. వింటూ ప్రాన్పడి అలాగే నిలబడిపోయినది సౌభాగ్యమ్మ. ఒకటి భూషణము గొంతుక. రెండవది లలితది. శేషగిరి ఇంకా ఇంటికి తిరిగి రాలేదు, అప్పటికి.

"మీ అత్తని కూడా తీసుకువస్తున్నారా?"

"ఎందుకూ? తగులాటము? ఇంట్లోనే ఉంటుంది." కత్తితో కోసినట్లు వచ్చింది సమాధానము.

"పోనీ, రానివ్వరాదూ? అమ్మయ్యా, ఆ! పోరి అడిగిందని అంటివి. ముసలివాళ్ళకీ ఏవో కోరికలు ఉంటాయిగా."

"కోరికలు ఎవరికి ఉండవు?, నీ చాదస్తము కాని. అసలే డబ్బుకి 'టకటగా' ఉంది. ఇప్పుడు ఆవిడ కూడా బయలుదేరితే బోలెడు కర్చు. తడిసి మోపెడవుతుంది"

"అది కాదే పిచ్చిపిల్లా! దాని వల్ల ప్రయోజనమూ ఉంది. ఆవిడ వచ్చినా అదునగా పెద్ద కర్చేంకాదు. శేషగిరికి 'హోటలు తిండి' సహించదంటూ వుంటివి. వెళ్ళిన చోటనల్లా, వంట పెట్టుకుని, కూర్చుంటే నీవు ఇక చూసేదేమి వుంటుంది?

కనుక ఆవిణ్ణి కూడా తీసుకెడితే, అటు తీసుకెళ్ళిన దానివి అవుతావు. అటు అవసరమూ గడిచిపోతుంది. నువ్వు హాయిగా అన్నీ చూడవచ్చును."

"నిజమే! ఇంతకీ వంట చెయ్యటానికి ఆవిడని తీసుకెళ్ళాలంటావు. బాగానే ఉన్నది. కాని పిల్లలు ఉన్నారుగా? వాళ్ళని ఎవరి నెత్తి మీద పెట్టాలి?"

"ఎవరూ? మీ ఆడబిడ్డ పిల్లలా? ఇంకా, ఆ ముసలాయన ఉన్నాడుగా. మీరేదో, సరిగా చూడటము లేదని అందరి దగ్గరా అల్లరి చేస్తున్నాడట్టవి! అక్కడే పెట్టేస్తే సరి. అందులో ఉన్న సాధక బాధకాలు ఆయన గారికీ తెలిసివస్తాయి. ఒక దెబ్బకి రెండుపన్లు అవుతవి!"

భూషణం పకపకమని నవ్వాడు. లలిత కూడా నవ్వుతూ, శృతి కలిపింది. సౌభాగ్యమ్మగారు నిటూర్చింది! చివరికి తనూ తన కూతురు బిడ్డలూ అంత లోకువ అయ్యేరన్నమాట! అసలు ఎవరిని నిందించి లాభము? తన కన్నకొడుకే అట్లా మారి పోయేక! తన ఇంట్లోనే తను అంత హీనంగా బతకాలిసి వస్తుందని సౌభాగ్యమ్మ కలలో నయినా అనుకుని ఉండలేదేమో?

అందుకే లలిత అడిగినప్పుడు మౌనంగా ఉండిపోయింది సౌభాగ్యమ్మ. భూషణం వచ్చి గుచ్చి గుచ్చి అడిగినప్పుడు 'రాను రాన'ని ఖండితంగానే, చెప్పేసింది. భూషణం! ఎట్లాంటి భూషణము ఏరకంగా మారి పోయాడు? తండ్రీ, తాతలున్ను కావాలని ఆమె మీద కత్తికట్టారు. భూషణము సౌభాగ్యమ్మకి వరసకి తమ్ముడు అవుతాడు. దూరపు చుట్టరికము. ఆ రోజులలో సౌభాగ్యమ్మ సంసారము మహాదు వైభవంగా, ఆరుకాయలూ పూవుగా సాగుతూ ఉన్నప్పుడు భూషణము వస్తూ ఉండేవాడు. అప్పుడు తను చిన్నవ్యాపారము చేస్తూ వుండేవాడు. "అక్కయ్యా! నా విన్నపొకటుంది, లలిత బంగారపు బొమ్మ. లలిని మీ ఇంట్లో దీపం పెట్టుకోవలసిందే. దాన్ని మీ కోడలుగా చేసుకున్నారంటే. ఇందులో బావగారి ప్రమేయం లేదు. ఆయన తల దూర్చటానికి వీలులేదు." అనేవాడు, నవ్వుతూ, భూషణము.

ఆయన నవ్వేవారు సౌభాగ్యమ్మ వంక చూస్తూ.

"అట్లాగే లేరా" అనేది తనూ, నవ్వుతూనే. కాలము 'గిరగిర' తిరిగిపోయింది. సావిత్రి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. శేషగిరి కాలేజిలో చేరేడు.

శేషగిరి పట్టభద్రుడయ్యాడు. నోట్లో నాలుక లేనివాడు. సావిత్రి [illegible] గట్టిది. దానికి తండ్రి పోలికలు వచ్చాయి. తన బిడ్డలు ఇద్దరూ కలిగిన ముత్యాలు. ఆనందప్రదమైనది తన సంసారము. కాని ఇది చూసి విధి వోర్వలేకపోయినది!

ఒకనాడు హఠాత్తుగా ఆయన సౌభాగ్యమ్మని వదిలిపెట్టి తన దారిని తను చూసుకున్నారు, పుణ్యాన కాలేక. సౌభాగ్యమ్మ ఒంటరిదయిపోయింది.

కాని సౌభాగ్యమ్మ ధైర్యంగా నిలబడింది. పుట్టెడు దుఃఖాన్ని గుండెల్లో దాచుకుంది. శేషగిరి మీద ప్రాణాలు నిలుపుకుని గుండె రాయి చేసుకుంది.

కాని శేషగిరి ఇంకా అర్భకుడు! ఆ పిసినారి రాజా వెనకాల బాగానే, మిగిల్చిపోయారు! కాని అది చాలవరకూ కాగితాల్లో ఉండి పోయింది. తను ఒంటరి. ఎవ్వరి సహాయం గలదు? కనుక అటువంటి పరిస్థితిలో పిల్లవాణ్ణి చూసి, పెట్టడానికి ఒక మనిషి అవసరము. సౌభాగ్యమ్మ దృష్టిలో భూషణము ఒకనాటి మాటలు మెదిలేయి, అప్పుడు.

ఆ ఉద్దేశ్యంతోనే ఒకనాడు పనిగట్టుకుని

# పెప్సొడెంట్ యొక్క ఇరియమ్ ప్లస్

## మీ పళ్లను శుభ్రపరచి
## మెరిసేలా తెల్లగా చేస్తుంది

**ఎలాగో చూడండి :** పెప్సొడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే శాస్త్రపద్ధతిలో తయారైన ఇరియమ్ ప్లస్ చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు సమృద్ధిగా కలిగి మీ నోటిలో అన్ని మూలలకు చేరి పళ్లను శుభ్రముగా, చల్లగా, పెప్పర్‌మింట్ రుచితో ఉంచుతుంది. అంతేకాదు, మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేయుటకు ఇరియమ్ ప్లస్‌కు తెల్లదనమునిచ్చే ప్రత్యేకమైన శక్తికూడ ఉంది.




హిందూస్తాన్ లీవర్
లిమిటెడ్ వారి
ఒక విశిష్టమైన తయారు

వాళ్ళ ఇంటికి వెళ్ళి భూషణాన్ని పెళ్ళి విషయము కదలేసింది. ఏ సంగతీ చెప్పమని నిలదీసింది ఆఖరికి, అతను దాటవేస్తూంటే. ఓపికగా, భూషణము అంతా విన్నాడు. ఏవేవో చాలా మాటలు చెప్పి సౌభాగ్యమ్మకి ధైర్యం పలికేడు. కాని అసలు విషయం దగ్గరకు వచ్చేసరికి, శేషగిరికి లలితని ఇవ్వడానికి ఇంట్లో వాళ్ళు ఒప్పుకోవడము లేదని చెప్పి, తప్పుకున్నాడు. భూషణము లోక్యం తెలిసినవాడు. అతనికి అట్లా అనటము అంత కష్టమనిపించలేదు.

అది విని సౌభాగ్యమ్మ దిగాలుపడి పోయింది. ఈ మధ్యన భూషణము వ్యాపారము చాలా బాగా ఉన్నదని ఆమె విన్నది. అతను ఇట్లా తప్పించుకొనటానికి అదే కారణము కావచ్చును. అయితే ఆ మనిషి మాటకి ఉన్న విలువ అంతేనా?

"పోనీలే అమ్మా! ఈ నాడు నాలుగు రాళ్ళు పోగుచేసినంతమాత్రాన అల్పులు ఎప్పుడూ అధికులు కాలేరు. అసలు నువ్వు భూషణంగారిని ఆవిషయం అడగకుండానే ఉండాలిసింది. శేషగిరిని చదువుకోనివ్వు. వాడికి ఏమి తక్కువ? వాడి పెళ్ళికి తొందర ఏమున్నది? ఆ వ్యవహారాలేమన్నా ఉంటే మా అల్లుడు చూస్తారులే" అని సౌభాగ్యమ్మకి ధైర్యం చెప్పింది సావిత్రి. అన్నట్టుగానే ఆస్తి విషయకంగా ఉన్న తగాదాలన్నీ పరిష్కరించి అంతా ఒకదారికి తీసుకుని వచ్చాడు అల్లుడు, ఆరు నెలల్లోనే.

అది జరిగి సంవత్సరమైనా తిరగకుండానే, తనకే ధైర్యం చెప్పిన కన్నకూతురు ఇద్దరు పిల్లల్నీ విడిచి తనకి అన్యాయం చేసి పోతుందని అప్పట్లో ఊహించలేకపోయింది సౌభాగ్యమ్మ. సావిత్రి గుండెజబ్బుతో మరణించింది.

శేషగిరి పసిపిల్లాడి లాగు ఏడిశాడు. సౌభాగ్యమ్మ శోకమూర్తి అయింది. ఎవరికి తప్పినా సౌభాగ్యమ్మకి తప్పలేదు. సావిత్రి బిడ్డల్ని ఇద్దర్నీ తనతో తీసుకుని వచ్చింది ఆమె. సావిత్రి మామగారు ఎంతో బాధపడి పోయేరు, సంవత్సరమయినా తిరగకుండానే రెండో పెళ్ళి చేసుకున్న కొడుకు గురించి.

"ఆ పిల్లల్ని ఏమి చేస్తావు?" అని ఆయన కొడుకు మీద దెబ్బలాడేరు. పిల్లలిద్దరి పేర్నా, కొడుకు చేత కొంత ఆస్తిని, వ్రాయించి గాని ఆయన శాంతించలేదు. కోడలు, సావిత్రిని తల్చుకుని ఇప్పటికీ కళ్ళ వెంట నీరు పెడతాడు ఆయన.

# ప్రయాణము

పిల్లలు ఇక్కడే ఉన్నారు గనుక వాళ్ళ 'ఆస్తి' కూడా శేషగిరి పర్యవేక్షణ కిందికే వచ్చింది. ప్రతిసంవత్సరమూ ఎంతో డబ్బు వస్తున్నది? అది ఏమవుతున్నదో సౌభాగ్యమ్మకి తెలియదు. ఈ విషయమై ఆమెని చీకట్లోనే ఉంచారు అందరూ.

సావిత్రి మామగారు అప్పుడప్పుడు వచ్చి, పిల్లల్ని చూసి పోతున్నారు.

సౌభాగ్యమ్మ, పిల్లల్నయితే తీసుకుని వచ్చింది గాని, వాళ్ళ చదువు సంధ్యలు ఏమి చూడగలదు? ఆ పిల్లలు గతిలేక, వచ్చి వీళ్ళ పంచను చేరలేదు.

శేషగిరి వాళ్ళని గురించి తనకున్న బాధ్యతని సక్రమంగా నెరవేరుస్తున్నాడా? అన్నదే ప్రశ్న. కనీసం సావిత్రిని తల్చుకునయినా, వాళ్ళ గురించిన కనీసపు శ్రద్ధను కనపరచవచ్చునే? అదీ తనకు చాత కాకపోతే, వాళ్ళని ఆ ముసలాయన దగ్గరకే పంపితే ఆయన పువ్వుల్లో పెట్టి ఇంత కంటే శ్రద్ధగా చూసుకుంటాడే? తన వంశాంకురాలన్న అభిమానం కొద్దీ, వాళ్ళ కోసం ఆయన ఏమయినా చెయ్యగలడు ఇప్పటికీ.

ఆయనపాటి కూడా చెయ్యలేక పోతున్నాడు శేషగిరి, అక్క నందానమన్న అభిమానము కూడా మరిచిపోయి. స్వార్థం మనుషుల్ని ఇట్లా మారుస్తుందేమో?

నిజం ఈ తప్పంతా తనదేనని నొప్పుకుంటుంది సౌభాగ్యమ్మ. అట్లా అప్పుడు, కావాలని తను వెళ్ళి అడిగితే ఏదో చెప్పి తప్పించుకున్నాడు భూషణము. రెండేళ్ళు గడిచింది. శేషగిరి బి. ఏ. పరీక్షలు రాశాక ఒకసారి సౌభాగ్యమ్మతో అన్నాడు, మాట వరుసకి.

బజారులో భూషణము కనిపించి ఇంటికి



తీసుకెళ్ళాడట! ఇంట్లో వాళ్ళందరూ శే గిరిని ఎంతగానో ఆదరించారట! లలి కింకా పెళ్ళికాలేదట! భూషణంగారి వ్యా రం దివాలా తీసిందట! అందరూ అ గురించి అడిగేరట ఎంతో ఇదిగా. అంటు చెప్పి "పాపం వాళ్ళు కష్టాలలో ఉన్నారు' అన్నాడు శేషగిరి.

సౌభాగ్యమ్మకి ఎంతో జాలి కలిగింది. ఇలు ఎక్కడో కనుక్కుని, ఆ సాయంత్రమే భూషణము ఇంటికి వెళ్ళింది. భూషణమ ఆమెని చూసి ఆశ్చర్యపోయాడు. తరువా ఎంతో సంతోషపడినాడు. "అక్కయ్యా నీ మనసు ఎంతో దొడ్డది. అభిమాన ఉంచి తిరిగి నా గడప తొక్కేవు. నా అది చాలు. దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు." అన్నాడు కృతజ్ఞతగా. అ జరిగి, రెండుమూడు రోజులయినా తిరగకుండానే భూషణం అన్నమాటలు విని సౌభాగ్యమ కనక ఆశ్చర్యపడలేదు! దేన్నీ మనసుల పెట్టుకుని కుళ్ళిపోయే స్వభావంకాద ఆమెది. తిరిగి అదే నోటితో, సిగ్గు విడిచి లలితని శేషగిరికి ఇస్తానని ప్రాధేయప అడిగేడు అతను. అప్పటికీ వాళ్ళ స్థి చూసి జాలితో కరిగిపోయిన సౌభాగ్యమ కాదనలేకపోయింది. శేషగిరి కూడా లలి గురించి నిద్రలో కలవరింతలు ప్రారంభి చేడు.

ఉన్నమాట చెప్పాలంటే, నిజంగా లలి తమ్మ బంగారపు బొమ్మే!!!

నెలరోజులయినా తిరగకుండానే పెళ్ళి జరిపించేడు, తెలివిగల భూషణము మొదట్లో ఎంతో అణకువగా ఉండే లలి తమ్మ, రాను రాను బలం పుంజుకుని గట్టి పడింది. శేషగిరిని పూర్తిగా ఆక్రమించె ఆవిడ అకారణంగానే కత్తికట్టి సౌభాగ్యమ మీద దండెత్తినది. దానికి కారణం, క పించలేదు, ఎంత వెదికినా సౌభాగ్యమ్మకి

ఒకనాడు అదే ఇంట్లో, సౌభాగ్యమ ఇష్టారాజ్యంగా, నడిచింది. సౌభాగ్యమ్మ ముందు ఆమె అత్తగారు. ఇప్పుడు ల తమ్మ. రేపు మరొకరు. అరకంగా ఒ వ్యవస్థలో ఎన్నో మార్పులు తెచ్చిపెట్ట గలదు కాలము.

కనుక దాన్ని గురించి సౌభాగ్యమ ఎప్పుడూ బాధపడలేదు. ఎటొచ్చీ, ఆవి బాధపడేది సావిత్రి పిల్లలని గురించి సావిత్రి తనని నిలదీసి అడిగినట్లు, అ

# ప్రయాణ కానుక

పిస్తుందామెకి. "అక్కా! నువ్వుండీ, నా పిల్లలకి అన్యాయం జరగనిస్తావా? శేషగిరి పెళ్ళానికి [illegible]. సరే. నువ్వు ఉండీ, పెద్ద దానివి, ఏం చేస్తున్నావు?" అని. దానికి సమాధానం దొరకక సౌభాగ్యమ్మ మనసు గింగిలాడిపోతుంది.

నిజంగా శేషగిరి ఎంత మారిపోయాడు! లేకుంటే, ప్రొద్దుట, లలిత ముందూ, భగవానును ముందూ తన మీద అన్ని కేకలు వేసి ఉండేవాడేనా? తల్లి కంటే, వాడికి నిన్నగాక మొన్న వచ్చిన 'పెళ్ళాము', 'మామ' ఎక్కువయ్యారా?

"నేను ఎందుకు రానంటున్నా"నని వాడు స్వయంగా అడుగడు? 'పిచ్చిసన్నాసి'కి చిన్నప్పట్నించి ముక్కుకోపం ఉంది. అదంతా ఎవరి మీదనో, చూపించాలి గదా!" కళ్ళు వత్తుకుని ప్రక్కకు తిరిగి పడుకుంది సౌభాగ్యమ్మ. చెవిలో దోమలు సంగీతము పాడుతున్నాయి.

'రోడ్డు' మీద రిక్షాలు గంటలు మోగించుకుంటూ వెళ్తున్నాయి. మొదటి ఆట సినిమా, వదిలి పెట్టేసినట్టున్నారు. శేషగిరి రాసుకోవటం అయిపోయినట్లుంది.

కలం 'అల్మారా'లో పెట్టడానికి గది లోనికి వెళ్ళాడు శేషగిరి. 'బెడ్‌లైటు' వెలుగులో మంచం మీద పడుకుని నిద్ర పోతున్నది లలిత. కనులు మిరుమిట్లు గొలుపుతున్నది ఆ అందము!! సొగసులు అన్నీ, మేళాయించి, అందాలన్నీ పేరికూర్చి నట్లు వెలుగుతున్నది అద్భుతముగా, ఆ బాలిక!! కాసేపు, రెప్ప వేయకుండా ఆమెనే చూశాడు, శేషగిరి. అంత అందము నకు వెనుక, వికృతమయిన మనస్సును పెట్టడము 'భగవానుడి లీల 'కాబోలు!' అనుకుని నిట్టూర్పు విడిచేడు శేషగిరి. "నిజంగా, స్వర్గము సాకారీభవించి మనీ భవించి, కరడుగట్టిన హృదయము లలితది! దానికి న్యాయము, జాలి అనేవి ఎప్పుడూ ఆమడ దూరాన్నే ఉంటవి! అందువలననే సావిత్రి అక్కయ్య పిల్లలకి నేను న్యాయం కలగ చెయ్యలేకపోయాను. ఆఖరికి అట్లా అంతా మంచిగానే జరిగింది" అనుకుంటూ హాలులోనికి వచ్చేడు శేషగిరి.

ఎదురుగా గోడకి వ్రేలాడుతూ వున్న సావిత్రి ఫోటో చూసి రోజూలా, తలవంచు కొంటాడు, అతను.

తలుపు చప్పుడు కాకుండా తెరిచి, బయటికి వచ్చాడు శేషగిరి. సౌభాగ్యమ్మగారు నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్నది. దగ్గరకు వెళ్ళి దాని మీద కూర్చున్నాడు శేషగిరి. ఉలికిపడి కనులు తెరిచింది సౌభాగ్యమ్మ. తన కొడుకు, తన పక్కలో కూర్చున్నాడు!!

"అమ్మా! నిద్ర పట్టటము లేదా?" ఆప్యాయంగా అడిగి, తిరిగి అన్నాడు శేషగిరి.

"రఘుని, రాణిని వాళ్ళ తాతగారి దగ్గర ఉంచి వచ్చేశాను. ఆయన ఎంతో సంతోష పడినారు. ఇన్నాళ్ళ నుంచీ వాళ్ళ పేరను మీద వచ్చిన 'డబ్బు' బాంకులో వేశాను. ఆ డబ్బు కూడా ఆయనకే అప్పచెప్పాను. ఆయన అప్పుడే వాళ్ళ చదువుకి మంచి ఏర్పాట్లు చేశారు. నేను ఆ విధంగానయినా, ఒక మంచిపని చేశానన్న తృప్తి కలిగింది నాకు. ఈ సంగతి నీకే చెబుదామను కున్నాను. కాని ఆయన ఒప్పుకోలేదు. ఈ వంక చూపించి, నేను చెయ్యాలను కున్నది చేసేశాను. మామూలుగా, అయితే ఈ పని నావలన అయ్యేది కాదు. వాళ్ళని ఎట్లా అయినా ప్రయాణం గురించి అక్కడ వదలాలి గదా! పనిలో పనిని తెగించాను. తరువాత ఈ సంగతి వాళ్ళకి తెలిసినా కేవలము నన్ను గొడవ పెట్టడం తప్ప, మన చేతులలో ఏమీ లేదు, ఇప్పుడు ఇక. పిల్లల్ని నీకు చూడాలనిపిస్తే ఎప్పు డయినా వెళ్ళి రావచ్చును. ఇక వాళ్ళు అక్కడే ఉంటారు. ఈ విషయం నీ మనసు లోనే ఉంచుకో. మొన్నే చెబుదామను కున్నాను. వీలులేకపోయింది." అన్నాడు శేషగిరి. 'కారణం ఏమిటి?' అని అడిగితే చెప్పలేడుగాని, నిజంగా అప్పుడు సౌభాగ్యమ్మ వెక్కి వెక్కి ఏడిచింది. శేషగిరి చెయ్యి వేసి నిమిరేడు. "పిచ్చి అమ్మా! ఎందుకూ ఏడుస్తావు? నేను చేతకాని వాడినయి నీ మీద ప్రొద్దున కేకలు వేశానా? నేను ఏమి చేసినా, నన్ను నా తల్లి క్షమించగలదు, గాని ఇంకొకళ్ళయితే ఊరుకుంటారా?" అంటూ ఆమె కన్నీరు తుడిచేడు. సినిమా నుంచి వచ్చి తలుపు తడుతూ ఉన్న భూషణా నికి వీధి తలుపు తీయటానికి, ప్రయాణానికి సర్ది హాలులో ఉంచిన సామాను గుండా అడుగులు వేసేడు శేషగిరి. ●

శ్రావణం రాకుండా ఉంటే బాగుండును లేకపోతే ఈపెళ్ళి ఆగిపోతే బాగుండును.. అనిపించేది ఆమెకు. "ఛీ! ఇంతలోనే పాడుఆలోచన. నేనే పోకూడదు? నాకోసం ఇలా జరగాలా" అనుకొనేది కకావిక లైన మనస్సును కూడగట్టుకొనేందుకు ప్రయత్నం చేసింది రాధిక.

ఇంతలోనే చెల్లెలు రాజ్యం యౌవ్వనంలో అడుగుపెట్టింది. నువ్వు చేసుకోకపోతే పోని రాజ్యానికైనా పెళ్ళి చేయవేమిటే అన్న బంధువర్గం మాటలు, అమ్మ కంగారు ఎక్కువై పోయింది. అవును ఆబాధ్యత అమ్మదేగా మరి! ఎంతోకష్టంగా ఒక బంధువు లాయన సహాయంతో మంచి సంబంధమే దొరికింది. అప్పుచేసి ఎలాగో పెళ్ళిఅయింది అనిపించింది. అప్పు తీర్చే బాధ్యతఆమెదే.

నవ్వుకుంటూ కేరింతలు కొడుతూ బరువు బాధ్యత అంటే తెలియకుండా సరదాగా జీవితాన్ని గడుపుతున్న ఆమె ఈడువాళ్ళని చూసినప్పుడు బాధపడేది. హాయిగా చదువు కొనే రోజులు, లేదా వివాహజీవితంలో తీయని కలలు గంటూ జీవించాల్సినది కదా! అని మధనపడేది. కాని ఒక మంచి పని చేయగల్గానని, మహత్తర కర్తవ్యాన్ని నిర్వర్తించానని బాధను ఆనందంగా అనుభవించేది. ఈవిధంగా నైనా మాతృసేవ చేస్తున్నాననుకొని తృప్తిపడేది.

రాజ్యం భర్తతోసహా తల్లికి నమస్కరిస్తూంటే ఎంతో సంతోషపడింది రాధిక తల్లి. తనూ ఎంతో సంబరపడిపోయింది. కాని రాధికకు పెండ్లి చేయాలనే తలంపు మనసులో ఎందుకు గట్టిగా తలంచ లేదా ఆతల్లి, అనుకుంది. దానికేం చక్కగా సంపాదించుకొంటోంది. అని సంతృప్తిపడ టమే ఆతల్లికి ఆనందమా?

'అదృష్టం......ఇది.....అదృష్టం.!' అను కొంది రాధిక ఇదివరలో రామలక్ష్మిమాటల్ని తలచుకుని.

"జీవితమంటేనే అంత. జీవితమున్నాక ఏదో ఒకకష్టం, చింత ఉంటూనే ఉంటాయి. డబ్బులేనివాళ్ళకు డబ్బు ఇబ్బందులు, డబ్బున్నవారికి పిల్లలు లేరనో, రెండూ వుంటే అనారోగ్యం, లేక మరేదో బాధ ఉంటూనే ఉంటాయి. సంతృప్తి ఎక్కడ? నాకింక ఏసుఖాలు అక్కరలేదు. ఈజీవితం యిలా వెళ్ళిపోతేచాలు. బొప్పెలుకట్టి పసుగు చెందిన ఈ ప్రయాణంలో ఏ సుఖము అక్కరలేదు. గమ్యం చేరితే చాలు. ఎవరికి ఏ సహాయం కావలసినా చేయటమే నావిధి.

# జీవితం

(10-వ పేజీ తరువాయి)

నేను యితరులకోసమే వున్నాను." అను కొని సంతృప్తిపడింది మునిమనవరాళ్ళను కన్న అవ్వలా! 'కళ్యాణికంటే నేను ఎంతో అదృష్టవంతురాల్ని. కళ్యాణికి తల్లితండ్రి ఉన్నారు. కావలసినంత డబ్బువుంది. ఆ అమ్మాయికి పాతిక యేళ్ళు వచ్చినా పెళ్ళి చేయలేదు. పోని చదువైనా ఉందేమో అంటే అదీలేదు. తల్లితండ్రిగా వాళ్ళు నిర్వర్తించాల్సిన దేమిటి? వాళ్ళ పిల్లల బాగోగులు కావా! ఆ అమ్మాయి జీవితం తరువాత ఎలా గడుస్తుంది? అమ్మా నాకు పెళ్ళి చేయమని అడుగు తుందా? పాపం ఆ అమ్మాయి తన దగ్గర ఎన్నో సార్లు బాధపడింది. ఏమైనా సరే వాళ్ళ తల్లిదండ్రులను అడిగేయాలా అనుకుంది. వాళ్ళదగ్గర చనువే గనుక అలాగే నిశ్చయించుకుంది. ఆబాధ తనకు లేదు. చదువుంది, ఉద్యోగముంది. ఇదిచాలు, అని సమర్థించుకునేది.

ఇంటికి రాగానే గిరివచ్చాడు. కాని రాధికకు మాట్లాడాలనిపించలేదు. అతనిలో మాత్రం మార్పు రాలేదు. రాజ్యం పెళ్ళికి అతను ఆమెకెంతో సాయం చేశాడు. అయినా సరేనిపించటంలేదనిపించింది ఆమెకి. మొత్తానికి మాట్లాడికేనేగాని అతను వదలలేదు. ఆరోజునుంచి ఆమెప్రవర్తనపరిశీలిస్తూనేవున్నాడు.

ఓరోజు కళ్యాణి రాధికను వాళ్ళింటికి తీసుకెళ్ళింది. తనను చొరవచేసుకుని అడగా లనుకున్నది అడిగేసింది తల్లిదండ్రుల్ని. తనుకూడా వాళ్ళకు చెప్పింది. ఆభార్యా భర్తలిద్దరూ ఒకరిముఖాలొకరుచూసుకు న్నారు. కళ్యాణి నీళ్ళు నిండిన కళ్ళతో అక్కడనుంచి వెళ్ళిపోయింది.

మరిచిపోయిన విషయం గుర్తుకొచ్చి నట్లున్న వాళ్ళ ముఖాలు చూసి 'పిన్ని గారూ, వస్తానండి, బూరెముక్క త్వరగా పెట్టేయండి' అంటూలేచింది. 'అలాగే నమ్మా' అంటూ నవ్వుకున్నారు వాళ్ళు.

రాధికవచ్చిన వేళావిశేషమో, కళ్యాణికి కళ్యాణ గడియ రావటమో? లేక మరేమోకాని వెంటనే కళ్యాణికి పెళ్ళినిశ్చయమైంది. ఇంతలో రాజ్యం తల్లి కాబోవటం ఇంటికి రావటమూ జరిగింది. కళ్యాణి పెళ్ళయి పోయింది. "నిన్ను ఎప్పుడు మరచి పోలేనే" అంటూ రాధిక రెండు చేతులు పట్టుకుంది కళ్యాణం బొట్టుతో సంతో షంగా మెరిసే కళ్ళతో కళ్యాణి అప్పుడు.

'అక్కా! నీవు సుఖపడటానికి పుట్ట లేదే, మాలాంటి వాళ్ళజీవితాలు నిలబెట్ట టానికి పుట్టావు. నీఋణం మేముతీర్చుకో లేము.." అంది చెమర్చిన కళ్ళతోరాజ్యం. "నాలోఏముంది? ఆరాముడిదయ అంతా" అంటూ సంతోషించింది.

కాలం నడుస్తోంది. శ్రావణం దగ్గర పడుతోంది. రాధిక మామూలుకార్యక్రమం జరుగుతూనే వుంది.

అప్పుడే వర్షం కురిసింది. పున్నమినాటి చంద్రుడు మబ్బుతెరలలోంచి తొంగి చూస్తు న్నాడు. వెన్నెల మసకమసకగాఉంది. 'ఈరోజు ఆలస్యం అయిపోయింది.' అనుకుంటూ కంగారుగా నడుస్తోంది రాధిక. ఇంత లోనే ఎవరిదో చెయ్యి భుజంమీద పడింది. కనుచూపు మేరలో ఎవరూ కనబడటంలేదు. హడలిపోయింది రాధ.

తిరిగిచూస్తే గిరి.'నువ్వాగిరీ హడలిపోయ్యాను.'

"సరేకాని ఇంత పొద్దుపోయింది కదా! ఎవరైనా ఏదైనా చేస్తే ఏంచేస్తావు?"

"పోనీలే! ఆ రోజే నాజీవితంలో ఆఖరిరోజు అవుతుంది. నేను ఎవరికోసం జీవించాలి? ఆ చివరిరోజుకోసమే ఎదురుచూస్తున్నాను."

"రాధికా!"

"అవును గిరి ఎవరికోసం బ్రతకాలి?"

"రాధా!నీలో ఇంత నిరాశ కలుగుతుందను కోలేదు. నాకోసమే నీవు బ్రతకాలి."

"హా, అదెలా, మొన్ననేగా మీ మావయ్య ఉత్తరం వ్రాశారు? మీకోసం బ్రతకాల్సింది నేను కాదు.."

"ఓహో, అమ్మాయిగారికీ పరీక్షలు. నిన్ను చాలా బాధించాను రాధా.....నన్ను క్షమించు. నువ్వే ఆ మావయ్యగారి అమ్మాయి." అంటూఆమెను తనవైపు తిప్పుకున్నాడు.

సంతోషంతో ఉక్కిరిబిక్కిరైపోయింది రాధిక. అతని గుండెలపై వ్రాలి టప టప కన్నీటిబొట్లు రాల్చింది.

"జీవితమంటే మీదేనండి" "మీరు అదృష్టవంతులండి" వరుసగా రామలక్ష్మి మాటలు జ్ఞాపకంవచ్చాయి.

"నిజంగా నేను అదృష్టవంతురాల్నే, జీవితమంటే నాదే, అంటూ గొణిగింది అస్పష్టంగా రాధిక. గిరి ఆమెను హృదయానికి అదుముకున్నాడు. చల్లని గాలి వీచింది. మబ్బుతెరలు దూరంగా పారిపోయాయి. చంద్రుడు 'నేనున్నా'నంటూ ఫక్కున నవ్వాడు. ●

# సుప్రభాతం

(సీరియల్)

రంగధామ్

## జ రి గి న క థ

సత్యమూర్తి, ప్రకాశం చిన్ననాటి స్నేహితులు. చాలాకాలానికి అనుకోకుండా కలిశారు. నిరుద్యోగిగా వున్న సత్యమూర్తికి రామవరం షుగర్ ఫ్యాక్టరీలో ఉద్యోగమిప్పిస్తానని అంటుంటాడు ప్రకాశం. సత్యమూర్తి అక్కడికి వెళ్ళేముందు లెక్చరరు అనంత రామన్ను, అతని కూతురు ఉమను కలుసుకున్నాడు. రామదాసుగారి దగ్గరకెళ్ళినపుడు ఆయన తన కథ కొంత చెప్పారు. మర్నాటి ఉదయానికల్లా ఆయన్ని ఎవరో పొడిచి, దాచుకున్నదంతా దోచుకుపోయారు.

## 3

క్రితం రోజు రాత్రి రామదాసుగారిని ఎవరో నిద్దట్లో బలంగా పొడుగాటి కత్తితో పొడిచి చంపేశారు. ఆయన ఇంట్లో ఒక మూల గొయ్యి ఖాళీగా వుంది. అందులో ఆయన ఏమైనా డబ్బుగాని వస్తువులుగాని దాచుకొని వుంటే అది దొంగల పాలయిందన్నమాట. రాత్రి ఏ సమయంలో జరిగిందో ఎవరికీ తెలియదు. ప్రొద్దున్న పనిమనిషి ఆయన తలుపు తోసేసరికి, ఈ దారుణమైన దృశ్యం కన్పించింది. అది వెంటనే గోలపెడ్తూ అందరికీ చెప్పింది. వెంటనే పోలీసు రిపోర్టు వెళ్ళింది. పోలీసులు వచ్చి ఆ ప్రదేశాన్నంతా చుట్టు ముట్టేశారు. అందరి వద్దా స్టేటుమెంట్లు తీసుకుంటున్నారు. ఇది వినగానే సత్యమూర్తి కాళ్ళు వణికాయి. ఇంత దారుణం జరుగుతుందని అతను కలలో కూడా వూహించలేదు.

"మీరూ వెళ్తారా, అక్కడికి?" అనడిగాడు సోడాకొట్టతను.

"అదే ఆలోచిస్తున్నాను." అన్నాడు సత్యమూర్తి. తను ఆ దృశ్యం చూడగలనా? అని అనిపించిందతనికి.

"వెళ్తే స్టేటుమెంటిమ్మంటారు."

ఆ విషయం అంతవరకూ ఆలోచించని సత్యమూర్తికి, అది అంత వాంఛనీయంగా తోచలేదు. అతనికి ఇంక అక్కడ వుండ బుద్ధెయ్యలేదు. మరొక పావుగంట కూచున్నాడు సోడాకొట్టు దగ్గర. కొందరు వచ్చి సోడాలు త్రాగుతూ, అక్కడ జరుగుతున్న విషయాలు చర్చిస్తుంటే, వివరాలు కొన్ని తెలిసాయి. హత్య ఒక్కడి వల్ల జరిగింది కాదనీ, ఇద్దరు గాని ముగ్గురు గాని వచ్చి వుంటారని ఊహిస్తున్నారు. గదంతా రక్తం పడివుంది. రామదాసుగారి తాలూకు వారెవరైనా వున్నారేమోనని పోలీసులు వాకబు చేస్తున్నారు. కాని, ఎవ్వరూ వున్నట్లు లేదు. శవాన్ని 'పోస్టుమార్టమ్'కు పంపడానికి ప్రయత్నిస్తున్నారు.

బరువైన హృదయంతో బయల్దేరాడు సత్యమూర్తి. తన మిత్రుడూ హితాభిలాషి, ఉపకారీ అయిన రామదాసు గారు ఘోరంగా హత్య చేయబడ్తే తను ఏం చెయ్యగలిగాడు? ఆఖరికి ఆయనను చూడడానికి కూడా భయపడుతున్న స్థితిలో వున్నాడు. పోనీ పోలీసుల వద్దకు వెళ్ళి ఆయన తనతో చెప్పిన విషయాలన్నీ చెప్తే? .... రాత్రి తననెవరో వెంటాడారని కూడ చెప్తే?..... ఒకవేళ ఈ విషయాలన్నీ విని పోలీసులు తననే అనుమానిస్తే? తన ప్రస్తుత పరిస్థితులలో అదొక అవాంఛనీయమైన పరిణామము. అందువలన తను మాట్లాడకుండా వూరుకోవడమే ఉత్తమం. కొన్ని సంఘటనలు అలావస్తాయి. వాటి నెదుర్కోవడం కష్టం.

ఆ రోజంతా సత్యమూర్తి ఈ విషయాన్ని ఆలోచిస్తూ వూరంతా తిరిగాడు. చాలాసేపు సముద్రపు వడ్డున గడిపాడు. మరి కొంతసేపు పోయాక, మళ్ళీ ఒకసారి ఆ వీధిలోని సోడాకొట్టు వద్దకు వెళ్తే, శవాన్ని పోస్టుమార్టంకు పంపారని తెలిసింది. రామదాసుగారు తనతో చెప్పిన మాటలను బట్టి ఆయన శత్రువులు చాలా బలవంతులని తెలుస్తోంది. వాళ్ళ శక్తి ఈ హత్యాకాండ ద్వారానే తెలుస్తోంది. ఇక మిగిలిందల్లా ఆయన కూతురు, వాళ్ళ చేతుల్లో పడకుండా చూడడమే. ఇంతవరకూ ఆయన కూతురు సంగతి తనకు మాత్రమే ఆయన చెప్పారు. వాళ్ళు ఆమె గురించి తెలుసుకునే అవకాశం లేదు. తను అతి జాగ్రత్తగా ఆమెకు ఈ విషయాలు తెలియజెయ్యాలి.

ఏదో తెలియని విచారం, బాధా, సత్యమూర్తి నారోజంతా ఆవరించింది. సముద్రపు ఒడ్డున ఒంటరిగా కూర్చున్నప్పుడు, ఆయన జీవితమంతా జ్ఞాపకమొచ్చి, మనసులోంచి దుఃఖం ఉబుకొచ్చి, అతని కండ్ల వెంట నీరు కారనారంభించింది. తనకంత ఉపకారం చేసిన వ్యక్తికి తను ఏం చెయ్యగలిగాడు? ఆఖరుకి ఉత్తర సంస్కారమైనా చెయ్యలేక పోతున్నాడు. మానవుడెంత అశక్తుడో తెలుస్తోంది, దీనివల్ల. ఒకవేళ క్రితం రాత్రి ఆయనను వదిలి వెళ్ళకుండా ఆయన గదిలోనే పడుకుని వుంటే, ఈ దారుణం జరుగకూండా తను అడ్డుపడేవాడేమో? అలా చెయ్యాలని తనకుగాని ఆయనకుగాని తట్టనేలేదు. విధి అంటే ఇదేనేమో? సత్యమూర్తి రెండు మూడు సార్లు తెరలు తెరలుగా వచ్చిన దుఃఖంతో ఏడ్చేశాడు. అప్పటికి మనస్సు కొంత తేలికైంది. ఇక, జరిగి పోయిన దానిని గూర్చి విచారించడం కన్నా, జరగవలసిన దానిని గురించి ఆలోచించడం ముఖ్యం.

సత్యమూర్తి ఇంటికి బయల్దేరాడు. తను వీలైనంత తొందరలో రామవరం మకాం మార్చెయ్యాలి. ఇంక వైజాగ్‌లో వుంటే, పని లేకపోవడంతో బాటు ఏదో దిగులుగా వుంటోంది. అందుకు ఏమీ చెయ్యలేక పోతున్నాడు. రామవరం వెళ్తే అక్కడ పనిలో మునిగి ఇక్కడి విచారాలను మర్చి పోవచ్చు.

ఇంటికి వెళ్ళేసరికి సత్యమూర్తికి కన్పించిన దృశ్యం తల్లి ఏడుస్తూండడం, ఇరుగు పొరుగు ఆడవాళ్ళంతా తన యింట్లో గుమిగూడడం. సత్యమూర్తి లోపలికి కంగారుగా వెళ్ళేసరికి, "కల్యాణి మనల్ని

వదిలిపెట్టి వెళ్ళిపోయిందిరా!" అని తల్లి బావురుమంది.

"ఏమిటీ? చెల్లాయా! ఎక్కడి కెళ్ళింది?"

"ప్రొద్దున్ననగా, స్నేహితురాలింటికి వెళ్ళింది. మధ్యాహ్నం రాలేదు. ఎక్కడి కెళ్ళిందా? అని నేను బెంగ పెట్టుకుని దాని స్నేహితులందరి ఇళ్ళకూ కబురు పెట్టాను. ఎవరింట్లోనూ లేదు. ఇప్పుడు ఒక కుర్రాడు ఈ చీటీ తీసుకు వచ్చి ఇచ్చాడు. స్టేషన్లో కన్పించి, మన యిల్లు గుర్తు చెప్పి, ఈ ఇంట్లో ఇచ్చెయ్యమందిట. ఇదిగో చీటీ." అని ఏడుస్తూ ఆ చీటిని సత్యమూర్తి చేతికి ఇచ్చింది. అందులో.....

'అమ్మకూ, అన్నయ్యకూ నమస్కారాలు. నన్ను గురించి మీరేమీ విచారించవద్దు. నేను ఒక స్నేహితురాలి సహాయంతో, స్వతంత్ర జీవనాన్ని గడుపుకునేందుకు వెళ్తున్నాను. మీతో చెప్తే నన్ను వెళ్ళనివ్వరని, చెప్పలేదు. నాకేమీ భయం లేదు. నా ప్రయత్నంలో సఫలీకృతురాలిని కాగానే మీకు తెలియబరుస్తాను. కళ్యాణి.' అని వుంది.

అది చదువుకొని, "ఆ కుర్రవాడు వచ్చి ఎంత సేపయింది?" అనడిగాడు సత్యమూర్తి. తల్లి ఒక గంటసేపయిందని చెప్పింది. అప్పటికి రెండు గంటల క్రితమే కలకత్తా మెయిలు వెళ్ళిపోయింది. ఆమె అందులో వెళ్ళిపోయుంటుంది. అయినా ఆమె స్నేహితురాళ్ళ నందర్నీ ఒకసారి కలుసుకుని ఎద్దామని బయల్దేరాడు. తల్లి ఏడుస్తూ వుంటే, "విచారించకమ్మా. దాని నెలాగైనా వెదికి పట్టుకుంటాను." అని వోదార్చాడు. కాని ఎంత తిరిగినా లాభం లేకపోయింది. ఎవరూ ఆమె గురించి గాని, ఆమెకు సహాయం చేస్తున్న స్నేహితురాలి గురించి గాని, ఏమీ చెప్పలేక పోయారు.

తిరిగి, తిరిగి రాత్రి పది గంటలకు ఇంటికి వచ్చాడు. సత్యమూర్తి. అతని మౌనం చూసి, తల్లి, "భోంచెయ్యి నాయనా, అదే నాలుగు రోజుల్లో తిరిగి వస్తుంది."-అని ధైర్యం చెప్పింది, దుఃఖం మింగుకొని.

* * *

రామవరం పేరుకు పల్లెటూరే అయినా రైల్వేస్టేషనూ, హైస్కూలూ, కాఫీ హోటళ్ళూ, ఒక సినిమాహాలూ, లాంటి హంగులన్నీ వుండడం, మేజరు పంచాయితీ కావడం వల్ల దానికి పట్టణపు కళ వస్తోంది. ముఖ్యంగా గత అయిదారేళ్ళలోనూ ఆ గ్రామం చాలా అభివృద్ధి చెందింది. దానికి కారణం ప్రకాశం అని ప్రతివాళ్ళూ అంటారు ఆ ఊళ్ళో. ఆ విషయమే సుబ్బయ్య గారు, కుమారస్వామితో చెప్తున్నారు బర్మా షెల్ డిపో ఆఫీసులో కూచుని. సుబ్బయ్యగారు కంపెనీ ఏజంటు. ఆయన



## సుప్రభాతం

వయస్సు నలభై అయిదేళ్ళు. పొట్టిగా సన్నగా వుంటాడు. మంచి మాటకారి. కుమారస్వామి, ఆ 'డిపో'కి మూడెరెంటెండెంటుగా వచ్చి నెల రోజులైంది. అతనికి ముప్ఫై ఏళ్ళుంటాయి. పొట్టిగా, లావుగా, చామనచాయగా వుంటాడు. నెరసినజుట్టూ, ఎర్రటి కళ్ళూ, నెమ్మదిగా మాట్లాడడం, చూసేవాళ్ళలో ఆదరకరమైన అభిప్రాయం కలిగించినా, మనిషి చాలా మంచివాడు.

"అసలు మా చిన్నతనంలో ఇక్కడేమి ఉందండీ! పట్టపగలు దోపిడీలు జరిగేవి. ఆనాటి కొన్నే మొన్న మొన్నటిదాకా మాత్రం, ఈ ఊళ్లో స్టేషనులో దిగడం, బస్సెక్కి మరో చుట్టు ప్రక్కల వూరుకి వెళ్లిపోయే వాళ్లేగాని, ఇక్కడున్న వాళ్లెంత మంది. రాత్రయ్యేసరికి ఎవరిళ్లల్లో వారు గప్‌చుప్‌గా ఉండిపోవడమే గాని ఒక్క మనిషి కనిపించేవాడా, బయట? అలాంటిది ఇప్పుడు స్కూళ్ళూ, సినిమా హాళ్లూ, పెద్ద కాఫీ హోటళ్ళూ, అన్నీ బయల్దేరాయి. ఈ సుగర్ ఫ్యాక్టరీ ధర్మమా అని లారీలూ, బళ్ళూ, తెగ తిరగడం ఆరంభించాయి. ఇంక సందడికి లోప మేమీ లేదు. ఇంకా ఎన్నొస్తాయో చెప్పలేం.'

"అయితే ఈ అభివృద్ధంతటికీ ప్రకాశం గారే కారణం అన్నమాట." అని అడిగాడు కుమారస్వామి.

"కొంతవరకూ అతనే అని చెప్పచ్చు. స్కూళ్ళు కోసం మేమంతా పట్టుబట్టి చందాలు వసూలు చేశాం. అందరి కన్నా ప్రముఖపాత్ర అందులో ప్రకాశానిది. అతను పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు అయిన దగ్గర్నుంచీ, ఒక్కొక్కటే ప్రారంభించాడు. అందులో రాజకీయాల్లోకిదిగి, ఏ పార్టీ మద్దత్తూ లేకుండా, స్వతంత్ర అభ్యర్థిగా అసెంబ్లీకి ఎన్నికైన దగ్గర్నుండీ అతని పలుకుబడి బాగా హెచ్చింది. సుగర్ ఫ్యాక్టరీ రావడానికి అతనే ముఖ్య కారణం. ఢిల్లీదాకా వెళ్ళి, మినిష్టర్లను పట్టుకొని, లైసెన్సులు సంపాదించి, ఫ్యాక్టరీ కట్టించాడు."

"ఇంతా చేస్తే వయస్సేమంత ఎక్కువ వున్నట్లు లేదు. మహావుంటే ముప్ఫై యి ఉంటాయేమో?"

"అంతేనండీ. అంతా దశ! అదొక 'స్టారు'! అల్లా వెలిగిపోతోంది. ఆ జాతక మహత్యం ఏమిటోగాని ఏది పట్టుకున్నా అతి సునాయాసంగా జయమైపోతోంది. ప్రకాశం— అంటే ప్రతివాడికీ హడల్! డబ్బు [illegible] మరి చెప్పడానికి వీల్లేదు, అల్లా గణిస్తున్నాడు. పర్మిట్లూ, కోటాలూ, బ్లాకుమార్కెట్లూ, ఒకటేమిటి? అన్నీ వాళ్ళ చేతుల్లోనే. ఎలాంటి వాళ్నైనా ఇట్టే పట్టెయ్యగలరు. ఎలాంటి పనైనా ఇట్టే సాధించగలరు. అసలు మంత్రంటే దామోదరానిది. వాడు వేసిన ప్లానుకు తిరుగు లేదు."

"ఈ దామోదరం ఎవరండీ? అసలు."

"దామోదరం అంటే ప్రకాశానికి గురువనుకోండి. వాడు చిన్నప్పటి నుండి ఈ ఊళ్లో పెరిగాడు గాని, అసలువాడిది ఈ దేశంకాదు. మలబారు వైపు. చిన్నతనంలో వచ్చేశాడు. అసలు మీ కంపెనీలో కొన్నాళ్ళు పనిచేశాడు, మొదట్లో."

"అవునుట. అప్పుడు కిరసనాయిల స్టాకు, తేనిదంతా చూపించేవాడుటగా?"

"ఆ. ఆ రోజుల్లో వాడి ప్రభ చెప్పడానికి వీల్లేదు. రైల్వే స్టాఫంతా వాడి స్నేహితులే. అందరికీ కిరసనాయిలు 'ఫ్రీ' సప్లై. కొంత తను అమ్ముకుని ఆ డబ్బుతో తాగేసేవాడు. అధికారి ఇన్‌స్పెక్షన్‌కు వస్తే, వాణ్ణి సప్లైలతో ముంచెత్తేసేవాడు. అందువల్ల ఎవడూ వీటికి వ్యతిరేకంగా 'రిపోర్టు' రాసేవాళ్ళు కారు, స్టాకు విషయం, అసలెంతఃఉందో

వాడికి తప్ప మరెవ్వరికి తెలిసేది కాదు."

"మరి ఇన్‌స్పెక్టరు వచ్చి స్టాకు ఎంతుందో చూశేవాడు కాదా? అప్పుడు తప్పించుకోవడానికి వీలులేదే?"

"ఆ! అక్కడే వుంది కిటుకు. ఇన్‌స్పెక్టరు, తను తీసిన కొలత ప్రకారం స్టాకు ఎంతవుందో రిపోర్టు రాసి మద్రాసు ఆఫీసుకి పుత్తరం పోస్టుచేసి రైలెక్కేవాడు. వాడూ వుత్తరం పడెయ్యగానే మనవాడు పోస్టుమాస్టర్ని పట్టుకుని ఆ వుత్తరం బయటికి తీయించేవాడు. తీసి అది చింపి, అందులో తప్పుడు రిపోర్టు పెట్టి పంపేవాడు. అందుకని ఇతన్ని పట్టుకోలేక పోయారు."

"మరి చివరికి?"

"ఇలా రెండు మూడేళ్లకు పైగా తప్పించుకున్నాడు. చివరకు ఒక ఇన్‌స్పెక్టరుకు ఈ సంగతంతా తెలిసి, అసలు రిపోర్టువున్న ఉత్తరాన్ని ఇక్కడ పోస్టు చెయ్యకుండా, జేబులో పెట్టుకుని రైలు ఎక్కాడు. దాంతో మనవాడికి ఆటకట్టయింది. అప్పటికీ వూరుకోకుండా తనూ ఆ రైలెక్కి, ఆయన రైల్వే పోస్టులు వాళ్లకిస్తాడో లేక ఏ స్టేషను పోస్టు బాక్సులో వేస్తాడో చూద్దామని బయల్దేరాడు. కాని ఇన్‌స్పెక్టరు వీడి కన్ను గప్పి ఎక్కడో దూరపు స్టేషనులో పోస్టువేశాడు. అది చూడగానే మద్రాసు ఆఫీసులో కలవరం బయల్దేరింది. వెంటనే ఆఫీసర్లను పంపించి స్టాకు సాధ్యం చేసుకున్నారు. కొన్ని వేల గాలన్ల సరుకు మాయమైంది. దాంతో దామోదరాన్ని డిస్మిస్ చేశారు. అసలు కేసు పెట్టి, శిక్ష పడవలసింది. కాని అధికార్లను మంచి చేసుకోవడం వల్ల, ఉద్యోగం పోవడంతో సరిపోయింది. అదృష్టవంతుడు కాబట్టి అంతటో తెలిపోయాడు."

"తరువాత?"

"ఆ తరువాత ఒకటి రెండేళ్లు ఇక్కడా, అక్కడా మిల్లర్ల దగ్గరా, ఓల్లర వర్తకుల దగ్గరా పని చేసి మెల్లిగా పెదబాబు గారింట్లో ప్రవేశించాడు. అక్కడ మెల్లిగా స్థానం సంపాదించాడు."

"పెదబాబుగారంటే...."

"అదే, ప్రకాశం, రాఘవులూ, వీళ్ల తండ్రి అన్నమాట. ఈ వూరికే కాక ఈ చుట్టు ప్రక్కలకు కూడా డబ్బూ, పలుకు

## సుప్రభాతం

బడి గొప్పగా కలిగిన వ్యక్తి. ఆయన ఈ ఊళ్ళో మొట్టమొదట ధాన్యం మిల్లు కట్టించాడు. భారీ వ్యాపారం చేసాడు. ఆయన ఇంట్లో చేరి, లేనిపోని కలతలన్నీ పెట్టాడు దామోదరం. వీడి మాయలో పడిన వాడెవడైనా, నాశనమై పోవలిసింది. రాఘవులికి త్రాగుడు నేర్పింది, వీడే..."

"ప్రకాశం, ఆయన అసలు కొడుకు కాదంటారా?"

"అవును. పెదబాబుగారు వుంచుకున్న దాని కొడుకు. కాని చిన్నప్పటి నుండీ వీళ్ళ యింట్లోనే చనువుగా తిరగడం, రాఘవుల్ని అన్నయ్యా అని పిలవడం, పెద్ద బాబు గారికి స్వంత కొడుకులాగే తిరుగుతూ, ఎవరికీ అనుమానం రాకుండా ప్రవర్తించడం వల్ల, అసలు రహస్యం తెలియని వాళ్ళకు, ప్రకాశం ఆయన రెండో కొడుకు అని, అనుకోడానికి వీలుగా వుండేది. అసలింకొకళ్ళ సంగతెందుకూ, ప్రకాశమే అలా అనుకున్నాడు. ఆఖరుకి, పెదబాబుగారు చనిపోయాక, రాఘవులికీ ప్రకాశానికీ మాటా, మాటా వచ్చి ప్రకాశం తన వాటా ఇమ్మంటే, రాఘవులు, 'అసలు ఈ ఆస్తిలో నీకేం హక్కు వుంది? పొమ్మన్నాడు. అప్పుడు ప్రకాశం, పెదబాబుగారి విల్లు తీయించాడు. అందులో ఆస్తిలో సగం రాఘవులుకీ, సగం తన కూతురికీ ఆమె సంతానానికీ వుంది. ప్రకాశం పేరేలేదు. అది చూసి ప్రకాశానికి మతిపోయింది. రాఘవులు ఇంట్లోంచి పొమ్మనడం, తనకు ఆస్తిలో వాటా లేక పోవడం, ప్రకాశం భరించలేక పోయాడు. ఒకనాడు, వాస్తవంగా, ఆత్మహత్యకు తలపెట్టాడు."

"అబ్బా!"

"అవునండీ. మనిషన్నవాడలాంటి పరిస్థితులలో ఏమైపోతాడో చెప్పండీ? చిన్నప్పటి నుండీ, అన్నా, నాన్నా, అంటూ ఆ యింట్లో పెరిగి, చివరి కొకనాడు హఠాత్తుగా తనెవరో, వాళ్ళెవరో, ఇద్దరికీ సంబంధమే లేదని తెలిస్తే ఆ మానవుడిక బ్రతగ్గలడా? అందులో ప్రకాశానికి పౌరుషం ఇంతా, అంతా కాదు. రాఘవులు తనని అన్నమాటలకి, "ఇహ, ఈ జీవితం ఎందుకు, రైలు క్రింద తల పెట్టేస్తానని" బయల్దేరాడు. అప్పుడు అతన్ని ఎవరూ వారించలేక పోయారు గాని దామోదరం పట్టుకుని ఆపు చేశాడు."

"అలాగా?"

"ఆపు చెయ్యడంలో ఇలా, అలాకాదు. మూడు రోజులు అహోరాత్రులు ప్రకాశానికి కాపలా కాశాడు, ఎప్పుడు ఏం చేసేస్తాడో అని. ఆ సమయంలో ప్రకాశానికి ఏం చెప్పాడో, ఏమిటో గాని, ప్రకాశం మనసు మారిపోయింది. తరువాత మళ్ళీ రాఘవులు దగ్గరికి వెళ్ళి, "జరిగిందేదో జరిగింది. ఇన్నాళ్ళ నుండీ మీ పంచన పడున్నాను, ఇప్పుడు మాత్రం ఎక్కడికి పోతాను? మీరే నాకు అప్పలు. మీరేం చెప్తే అది చేస్తాను" అన్నాడట. ఆ మాటలికి రాఘవులు, మనసు కరిగిపోయి, 'నేను మాత్రం కాదన్నానా? ఈ ఇంటి పెత్తనమంతా నువ్వే నడుపు' అని ప్రకాశాన్ని ఆదరించాడట. అప్పటి నుండి రాఘవులు విపరీతంగా తాగ నారంభించాడు. వాళ్ళ ఆస్తి, ధాన్యం మిల్లు మేనేజిమెంటంతా ప్రకాశానిది. చివరివరకూ రాఘవులు ప్రకాశాన్ని నమ్మాడు. నాలుగేళ్ళలో, ప్రకాశం ఏం మాయచేసాడో, సర్వేశ్వరుడికే ఎరుక, ఆస్తిలో రాఘవులి వాటా అంతా ప్రకాశం చేజిక్కించుకున్నాడంటారు. చివరికి రాఘవులు హఠాత్తుగా మరణించాడు. అందరికీ మనసులో ఇది 'హత్య' అనే అనుమానం. కాని ఒక్కడు నోరు మెదల్ప లేదు."

"అంత ఘోరమా?"

"మరి! ఉన్నట్టుండి అకస్మాత్తుగా కడుపునొప్పి వచ్చి చచ్చాడంటే, అనుమానం వెయ్యదూ. భార్య పుట్టింటికి వెళ్ళింది. ప్రకాశం హైద్రాబాదులో వున్నాడు. దామోదరం విశాఖపట్నం వెళ్ళాడు. ఆ సమయంలో ఏం జరిగిందో, ఆ సర్వేశ్వరుడికే ఎరుక, రాఘవులు కడుపునొప్పి అని అన్నాడు. వాంతులూ, విరేచనాలూ అయ్యాయి. డాక్టరు వచ్చి చూస్తూనే 'లాభం లేదు' అని పెదవి విరిచాడు. మరొక అరగంటలో పోయాడు. అందరికీ టెలిగ్రాము లిచ్చారు. భార్య మట్టుకు సాయంకాలానికి రాగలిగింది. దామోదరం టాక్సీలో వచ్చి వాలాడు. సాయంకాలం దహనం చేసేశారు. ఇదీ జరిగినవిషయం. మరునాడు 'ప్లేన్' నుండి దిగాడు ప్రకాశం. అంతకు పూర్వమే రాఘవులి వాటా అంతా ప్రకాశం పేర రాసేశాడు, అతని చావుతో ప్రకాశం పరిస్థితి బలపడి పోయింది."

"ఇంకేముంది? ఆస్తంతా ప్రకాశానికి సంక్రమించినట్లేగా? అతనికిక ఎదురు లేదు."

"అబ్బే పొరపడు తున్నారు. ఆస్తిలో సగం వాటాయే రాఘవులుది. అది మాత్రమే ప్రకాశం, తన చేజిక్కించుకోగలిగాడు. మిగిలిన సగం, రాఘవులి చెల్లెలిది. ఆమె ఎక్కడుందో ఎవరికీ తెలియదు."

"అరే! తమాషాగా వుందే. మరి ప్రకాశం ఊరుకున్నాడా?"

"అబ్బే! ఆవిడ గురించి విశ్వప్రయత్నం చేస్తున్నాడు."

"అసలు ఆవిడ సంగతి ఎవరికీ తెలియక పోవడ మేమిటి?"

'అదంతా ఒక పెద్ద కథ....."

ఆ సమయంలో డిపో ఆఫీసులోకి మరొక వ్యక్తి ప్రవేశించడం జరిగింది. ఆ వ్యక్తికి సుమారు పాతికేళ్ళుంటాయి. కొంచెం పొట్టిగా, సన్నగా, ఎర్రగా వుంటాడు

అతని పేరు సూర్యం. డిపోకి ఎదురుగా వున్న ఒక కంపెనీలో గుమాస్తా. అతనికీ కుమారస్వామికీ కొద్దిగా పరిచయం ఏర్పడింది. అప్పుడప్పుడు ఆయనను పలకరిస్తూ వుంటాడు.

"మీకోసం ఒక ఇల్లు చూశాను, సాయంకాలం అలా వెళ్లి చూద్దామా?" అని అడిగాడు సూర్యం కుమారస్వామిని.

"అలాగే. ఎక్కడ?"

"రైలు కట్ట అవతల. ఇల్లు పెద్దదే; బాగానే వుంటుంది."

"ఎవరిది?" అనడిగారు సుబ్బయ్యగారు.

"కామయ్యగారిది." అన్నాడు సూర్యం.

"అయితే బాగానే వుంటుంది. అసలాయన ఎవరికీ అద్దె కివ్వడు. లేకపోతే బోలెడంత అద్దె వచ్చేది." అని సుబ్బయ్యగారు లేస్తూ, "అయితే మీరటువైపు వచ్చినప్పుడు, మా యింటికి కూడా ఒకసారి దయచెయ్యండి. వస్తా" నని చెప్పి వెళ్లిపోయారు.

"తొందరగానే వదిలాడే," అన్నాడు సూర్యం.

కుమారస్వామి నవ్వుతూ, "ఏం?" అన్నాడు.

"అబ్బే మామూలుగా ఆ ఘటం అంత సులభంగా వదల్డే. ఎక్కడెక్కడి విషయాలూ చెప్పుకు వస్తాడు. అంతా తన గురించేనా, మరెవరి గురించేనా, ఇంత సేపూ?"

"ప్రకాశంగారి గురించి."

"ఆ. అదీ సంగతి. అందుకే తొందరగా ముగించాడు. ప్రకాశం అంటే వీళ్లందరికీ, కడుపులో మంట. తమ కళ్ల ముందరే, ఇంత చిన్నతనంలో ఇంత పైకివచ్చాడే, అని అసూయ. మళ్లీ రోజు కొకసారి అక్కడికి వెళ్లి, 'మా ప్రకాశం', 'మా ప్రకాశం' అని పొగుడుతూ వుంటారు. లేకపోతే ఏం చేసేస్తాడో అని భయం.'

"అహా. అతనంటే భయంకూడానా?"

"వో. అతను తల్చుకుంటే ఏమైనా చెయ్యగలడు. అతను 'హత్య' చేసేసినా ఈ ఊళ్లో అడిగే నాథుడే లేడు. పైగా ఎవరికి ఏ సమయంలో అతనితో అవసరం వస్తుందో తెలియదు. ఆఫీసర్లంతా అతని చేతిలో వాళ్లు. అంటే, చిన్న ఆఫీసర్లు కాదు. రాష్ట్ర స్థాయిలో వాళ్లూ, సెంట్రల్ గవర్నమెంటు వాళ్లూ, అంతా అతనెంత చెప్తే అంతే. మినిస్టర్లు కూడా, ఇతనికి బాగా స్నేహం. అందువల్ల, ఎవడూ అతనితో విరోధం తెచ్చుకోడు. పైగా అతని పగ అంటే త్రాచుపాము పగలాటిది. విరోధిని అంతం చెయ్యందే వదలడు. అందుకని అతని దగ్గర నోరు ఎత్తరు."

"సుబ్బయ్యగారా ఈ ఊరి వారు కాబట్టి, అన్ని విషయాలూ చెప్పుకు వస్తున్నారు. ఇవాళ కొంచెం, పని తక్కువగా వుండి తీరిక దొరకడం వల్ల, సావకాశంగా మాట్లాడు కుంటున్నాం."

"అందరి సంగతీ చెప్పాడు గాని, తన కూతుళ్ల సంగతి చెప్పాడా?" అని వెటకారంగా అడిగాడు సూర్యం.

"ఏమిటి విశేషం? ఎంత మంది ఆయన కూతుళ్లు?"

"నలుగురు. అందులో ఒక్కరికీ పెళ్లి కాలేదు. కాని వాళ్లకున్న చొరవా, స్వాతంత్రము మగ వాళ్లలో కూడా వుండవు. అదంతా ఒక పెద్ద కథలెండి. ఆయనకు వాళ్లంటే తగని ప్రేమ. వాళ్లేంచేసినా ఆయన వాళ్లనేమీ అనడు. అందుకని వాళ్ల ఆటలు బాగా సాగుతున్నాయి. అందులో రెండో అమ్మాయి, ఏకంగా సినిమాలలోనే చేరిపోవాలని ప్రయత్నించింది. మద్రాసులో రెండు నెలలు మకాం పెట్టి, ఎక్కడా లాభం లేక తిరిగి వచ్చేసిందంటారు!"

సూర్యం మాటలకి కుమారస్వామి నవ్వాడు. "ఈ రోజుల్లో యువతీ, యువకులు అందరికీ ఉండే ఆశయమే కదా? అందులో ప్రత్యేకత ఏముంది? అందరి కన్నా కాస్త ఎక్కువ చొరవ చూపించిందన్నమాట."

"నిజమేలెండి. కాని కాస్త అందమైన విగ్రహమై, ఆటా, పాటా వచ్చి వుంటే అనుకోవచ్చు. కానీ బొత్తిగా, ఏ బిచ్చకత్తె వేషానికోగాని పనికిరాని పర్సనాలిటీ అయినప్పుడు ఆ ప్రయత్నం ఎందుకంట? ఇంకా ఆమాటకొస్తే ఆమెకన్నా చిన్నమ్మాయి చాలా అందంగా వుంటుంది. కాని ఆ అమ్మాయికి ఇలాటివన్నీ అంటే అసహ్యం."

"అన్నట్లు, ఈ వూళ్లో ఏదో క్లబ్బు వుందన్నారు?"

"ఆ. ఏంక్లబ్బండీ, పట్టి పేకాట తప్పించి అందులో ఏమీలేదు. కాలక్షేపానికి వేరే గతిలేక ఆ క్లబ్బుకు వెళ్లడం కాని, అంతకన్నా మరేంలేదు. దానికి సెక్రటరీ గోపాలన్ అని దామోదరంగారి అబ్బాయి. వాడికి ఇరవై నాలుగు గంటలూ పేకాటా, డోసా వుండాలి. ఇంక తక్కి మెంబర్లు సుగర్ ఫ్యాక్టరీలో పనిచే వాళ్లు చాలామంది వున్నారు గానీ, అంద రికీ పేకాట పిచ్చే."

"అయితే సాయంకాలం అలా, ఇల్లు చూడడానికి వెడదామా?"

"ఓ. తప్పకుండా." అని చెప్పి సూర్యం వెళ్లిపోయాడు.

సాయంకాలం ఇద్దరూ బయల్దేరారు. రైలు స్టేషను కివతలవైపు ఒక ఫర్లాంగ మేర మాత్రం బజారూ, సందడి క పిస్తుందిగాని ఆ వూళ్లో, స్టేషను కవత అంత సందడి వుండదు. రైల్వే వారి చెందిన ఖాళీస్థలం దాటితే ఒక రోడ్డు ప్రారంభ మవుతుంది. అది కొంత దూర సూటిగా వెళ్లి, అక్కడున్న సుబ్బయ గారింటి చుట్టూ తిరిగి, అలా పొలా ప్రక్కన ఫర్లాంగున్నర దాకా సాగి అక్క ఆగి పోతుంది. ఆ రోడ్డుకి ఇవతలి వై కొన్ని యిళ్లున్నాయి. మరి కొన్నిళ్లు క్రొత్తగా లేస్తున్నాయి. అక్కడికి మై దూరంలో సుగర్ ఫ్యాక్టరీ వుంది. ఫ్యాక్ట వచ్చి మూడేళ్లయింది. అది వచ్చా కొన్నిళ్లు క్రొత్తగా లేచిన మాట వాస వమే కాని వూరు పెద్దగా అభివృద్ధి చెం లేదు. సుబ్బయ్యగారింటికి కొద్దిగా అ తల, రోడ్డుకు ప్రక్కగా కామయ్యగారిల్ వుంది. ఈ రోడ్డుకు సంబంధం లేకుం రెండవ దిక్కుగా, రెండు పెద్ద ధాన్య మిల్లులూ, ప్రకాశం యొక్క మిలు అతని మేడా వున్నాయి. అక్కడ నుం ఒక చిన్న రోడ్డును వేయించి, దానిన తిన్నని రోడ్డుకు కలిపారు. అది సరా సుగర్ ఫాక్టరీ దాకా వెళ్తుంది. మర వైపున, రైల్వే లెవల్ క్రాసింగ్ దా వెళ్తుంది. దాని పొడవు సుమారు మై దాకా వుంటుంది. అది కేవలం 'ట్రాఫికు కోసం వేసిందే గాని, దానికి ఇరుప్రక్క ఇళ్లేమీ లేవు.

సుబ్బయ్యగారింట్లో కాఫీ ఫలహార

# సుప్రభాతం

సేవించి, సూర్యం, కుమారస్వామీ, కామయ్యగారిల్లు చూడడానికి వెళ్తుంటే ఒక వ్యక్తి రోడ్డు మీద ఎదురయ్యాడు. అతనిని చూడగానే సూర్యం, "ఏమండీ సత్యమూర్తిగారూ, క్లబ్బుకు వెళ్తున్నారా?" అని అడిగాడు.

"లేదండీ అలా, ట్రావెలర్సు బంగళాలో ఎవరో, ఆఫీసరు వచ్చాడంటే వెళ్తున్నాను." అన్నాడు, కుమారస్వామి మొహం వైపు సందేహంగా చూస్తూ. కుమారస్వామి కూడా అతనిని పరిశీలిస్తున్నాడు.

"వీరు సత్యమూర్తిగారని, షుగర్ ఫాక్టరీలో అక్కౌంటెంటు. నాకు చాలా మంచి స్నేహితులు. వీరు, మన బర్మా షెల్ కొత్త సూపరింటెండెంటు, కుమారస్వామిగారు." అని సూర్యం వారుభయులకు పరిచయం చేసాడు. వారిద్దరూ ఒకరి నొకరు పలకరించుకున్నాక, సత్యమూర్తి, మళ్ళీ కలుసుకుంటానని చెప్పి వెళ్ళిపోయాడు.

"చాలా మంచి మనిషి. తెలివైనవాడు. కష్టపడి పని చేస్తాడు. ఇతనిలా ఆ ఫ్యాక్టరీలో ఎవరూ కష్టపడరు. అక్కడి వాళ్ళంతా ప్రకాశానికి ఇంతో అంతో దూరపు చుట్టాలో, మొహమాటస్థుల తాలూకా మనుషులో. అందువల్ల ఎవరికీ ఎవరి ఖాతరూ లేదు. ఏమన్నా అంటే "ప్రకాశం మావాడే అంటారు."

"మరి సత్యమూర్తిని ప్రకాశం ఎరుగడా?"

"ఎరక్కేం. వాళ్ళిద్దరూ చిన్నప్పటి నుండీ ప్రాణ స్నేహితులు. విశాఖపట్నంలో ఇద్దరూ కలిసి చదువుకున్నారు. షుగర్ ఫాక్టరీ క్రొత్తగా కట్టున్న రోజులలో, సత్యమూర్తిని తీసుకు వచ్చి ఇక్కడ గుమస్తాగా వేశాడు, ప్రకాశం. ఇతను కష్టపడి ఆఫీసునంతా ఒకదారికి తెచ్చాడు. అప్పుడు నూరు రూపాయలతో చేరిన వాడేం, ఈ మూడేళ్ళలోనూ, రెండు వందల జీతంలోకి వచ్చాడు. ఇదిగో కామయ్యగారిల్లు."

(సశేషం)

చిత్రసమీక్ష:

# భూలోకంలో యమలోకం

జానపద చిత్రాలు జనాన్ని ఎక్కువగా ఆకర్షిస్తాయని గౌరి ప్రొడక్షన్సువారికి బాగా తెలుసు. ఈ సంస్థ నిర్మించిన చిత్రాలు చాలవరకు విజయవంతమైనవే. నూతన చిత్రం 'భూలోకంలో యమలోకం' వి. వి. యస్. స్టూడియోలో పత్రికల వారికి చూపించారు. పేరుతో ప్రజల్ని ఆకర్షించగలిగే ఈ చిత్రం, అభూత కల్పనలు సినిమాకథంగాని ఎంత అరోగ్య కరమైనవో తెలియజేయడానికి ఒక ఎక్స్‌పెరిమెంట్!

రుద్రాక్షుడనే మాంత్రికుడు అత్యాశకు పోయి దేవిని కొలిస్తాడు. అతడు సర్వశక్తి సంపన్నుడు కావడానికి తనకు బలి కావాలంటుంది దేవి. బలి కాబోయే వాడి 'క్వాలిఫికేషన్స్' ఒక తెలుగు సినిమాకథ నడిపించేంత అసాధ్యమైనవిగా వుండాలంటుంది. 'సుక్షత్రియుడై వుండాలి. పెళ్లి అయికూడా బ్రహ్మచారిగా వుండాలి! రుద్రాక్షుడంతటి శక్తిమంతుడూ అయివుండాలి!' కొన్ని యోగ్యతలు గల రాకుమారుడు రాజవాహనుడు. రుద్రాక్షుడతణ్ణి ఎట్టిభద్రుణ్ణి చేస్తాడు. రాజవాహనుడికి జంట కళావతి. భూలోకంలో రుద్రాక్షుడు సూత్రధారుడుగా వుండి స్వప్రయోజనాలను సాధించుకునేందుకు కథ నడిపిస్తాడు. అతని వస్తేపోగానే భూలోకంలో యమలోకం చూపించి అతన్నక్కడికి పంపించేస్తాడు రాజవాహనుడు. టాకీలో మాలోకంగా వున్నా, 'టాకీ' లో (ల్లో) ఆశయాన్ని పెరవేర్చుకుంటుంది చిత్రం. సవ్యాసవ్యాల గురించి ఆలోచించుకోకుండా వుంటే సినిమా చూస్తున్నంత సేపూ సరదాగానే వుంటుంది. ప్రేక్షకులికి భూలోకంలో యమలోకం చూపించదామన్న నిర్మాతల లక్ష్యం చాలా గొప్పది!

బహువేషధారియైన రుద్రాక్షుడిగా రాజనాల ప్రతిభావంతమైన నటన కనబరిచారు. రాజవాహనుడిగా కాంతారావు అందంగా నటించారు. కళావతిగా రాజశ్రీ పాత్రకు ప్రాణం పోసింది. భూలోకంలోను యమలోకంలోను వెలసి జీవించిన వాళ్ళు యింకా వున్నారు. అందులో కొందరు—వాణిశ్రీ, రత్న, పుష్పవల్లి, రాజబాబు, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ.

క్రూరజంతువుల పోరాటాలు; కత్తి యుద్ధాలు, మాయలు మహత్తులు మేళవించి వున్న ఈ చిత్రానికి దర్శకుడు: జి. విశ్వనాథం. రచన: జి. కృష్ణమూర్తి, సంగీతం: కోదండపాణి, కెమెరా: వేణు, సత్యం; ఛోప్రా, నిర్వాహణ: భావనారాయణ, పూర్ణా పిక్చర్స్ విడుదల.

—సి. కనకాంబరరాజు

# చిత్రలహరి

## పద్మశ్రీ పిక్చర్స్

నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, సావిత్రి, కాంచన, రావి కొండలరావు, అల్లురామలింగయ్య, శాంతకుమారి ముఖ్య భూమికలు పోషిస్తున్న పద్మశ్రీ పిక్చర్స్ వారి కొత్త సాంఘికం యింతవరకు ఏడు రీళ్ళు పూర్తి చేసుకున్నది. రెండు పాటలు చిత్రీకరించారు. పాటలని ఘంటసాల, సుశీల, శాంతకుమారి పాడారు. మూడవ షూటింగు షెడ్యూలు నవంబరు 21 నుంచి 30 వరకూ కొనసాగుతుంది.



మోహినీ భస్మాసురలో పద్మిని



'ఇద్దరు మొనగాళ్లు'లో కృష్ణకుమారి

రచన: ముళ్లపూడి వెంకటరమణ, సంగీతం: కె. వి. మహదేవన్, దర్శకుడు: పి. పుల్లయ్య హైదరాబాద్‌లోని శ్రీ సారథి స్టూడియోలో నిర్మించబడుతున్న యీ చిత్రానికి నిర్మాత: వి. వెంకటేశ్వర్లు బి. ఏ.

# చిత్రలహరి

## దర్శకుడుగా 'శ్రీ బాపు'

తన చిత్రలేఖనం ద్వారా ఆంధ్రయువజనంలో అపూర్వ చైతన్యం తీసుకువచ్చిన ప్రసిద్ధ యువచిత్రకారుడు శ్రీ బాపు ఒక చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. నందన మూవీస్ బేనర్ మీద నిర్మించబడే యీ సాంఘికానికి బాపు దర్శకుడుగానే కాక, కళాదర్శకుడుగా కూడా పని చేస్తారు. ప్రఖ్యాత హాస్య రచయిత శ్రీ ముళ్లపూడి వెంకటరమణ—బాపు కలసి రూపొందిస్తున్న చిత్రం గనుక, యిది పూర్తిగా హాస్య ధోరణిలో నడుస్తుందని అనుకోవడానికి వీల్లేదు. గోదావరి అంత గంభీరంగానూ ఉండవచ్చును. ఏమయినా ఒకటి మట్టుకు చెప్పగలము. 'చిత్రంలో కొత్తదనం, చిత్రీకరణలో ఒక ప్రత్యేకతను ఆంధ్రప్రేక్షకులు చూడగలుగుతారు. కృష్ణ, విజయనిర్మల, శారద, రాజబాబు, రామన్న పంతులు ముఖ్యభూమికలు పోషించగలరనీ, చిత్రం ఎక్కువభాగం ఔట్‌డోర్‌లో షూట్ చేయబడగలదనీ తెలుస్తున్నది. కథ, సంభాషణలు: ముళ్లపూడి వెంకటరమణ రాస్తున్నారు. గీతాలు: ఆత్రేయ, దాశరథి మున్నగు అగ్రశ్రేణి గేయ రచయితలు రాస్తారు. సంగీతం: కె. వి. మహదేవన్, కెమేరా: సెల్వరాజు నిర్వహిస్తారు.

## పూలరంగడు

అన్నపూర్ణావారి "పూలరంగడు" చిత్రం ఈ నెల మొదటి తేదీ నుండి హైదరాబాద్‌లో ప్రారంభించారు. నాగేశ్వరరావు, జమున, శోభన్‌బాబు, విజయనిర్మల, చలం గుమ్మడి, పద్మనాభం, సూర్యకాంతం ముఖ్య భూమికలు ధరిస్తున్నారు. ఈ షెడ్యూలు 10 వ తేదీ వరకు ఉంటుంది. ఇప్పటికి రికార్డింగ్‌కు ఆరుపాటలు సిద్ధమయినవి. వాటిలో మూడు కొసరాజు, మూడు సి. నారాయణరెడ్డి రాశారు. సంగీతం: యస్. రాజేశ్వరరావు, దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు, నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు బి. ఏ.

## గొల్లభామ

గతవారంలో శేఖర్ ఫిలిమ్స్‌వారి "గొల్లభామ" చిత్రం షూటింగు శారదా స్టూడియోలో ముమ్మరంగా సాగింది. మోహిని మందిరంలో కొన్నిదృశ్యాలు, రెండు పాటలు చిత్రీకరించారు. యన్. టి. రామారావు, విజయనిర్మల, యల్. విజయలక్ష్మి యీ షెడ్యూలులో పాల్గొన్నారు. ఈ చిత్రంలో దేవిక కథనాయిక భూమికను నిర్వహిస్తున్నది. రేలంగి, గిరిజ, పుష్పవల్లి, నాగరాజు, ధూళిపాళ తారాగణంలో యితర ముఖ్యులు. రచన: జానియర్ సముద్రాల, సంగీతం: టి. వి. రాజు, కెమెరా: రవికాంత్, దర్శకుడు: సి. పుల్లయ్య, నిర్మాతలు: కె. సోమశేఖర్, డి. రాధాకృష్ణ.

## పార్వతీ శపథం

సందేశ్ పిక్చర్స్‌వారి "పార్వతి శపథం" చిత్రం తాలూకు రెండవ షూటింగు షెడ్యూలు ప్రకాష్ స్టూడియోలో కొన



'ఆస్తిపరులు'లో జేబిపద్మిని, నాగేశ్వరరావు



'సరస్వతీ శపథం' వర్ణచిత్రంలో నాగేష్, కె. ఆర్. విజయ

న్నది. రాజశ్రీ, కాంతారావు, గీతాంజలి, పద్మశ్రీ నాగయ్య, బేబి శ్యామల, బేబి విజయ మున్నగువారు నటిస్తున్నారు. కెమెరా: హెచ్. అప్పారావు, సంగీతం: బి. శంకర్, దర్శకుడు: ఐ. యస్. మూర్తి, నిర్మాత: ఆమర్తి నరసింహమూర్తి.

## ఆంధ్రలో థియేటర్లు కావాలి!

## శ్రీ బి. యన్. రెడ్డి అభిభాషణ

"ఆంధ్రప్రదేశ్‌లో థియేటర్ల ఆవశ్యకత యీనాడు ఎంతగానో ఉన్నది. ఔత్సాహిక నాటక సమాజాలు అనేకం చక్కగా, రసవంతంగా ప్రదర్శించేందుకు ముందంజ వేస్తున్నవి. అయితే వారి ప్రదర్శనలకు అనుగుణ్యమయిన స్థలాలు (థియేటర్లు) ఆంధ్రలో లేవు. తిరుపతి, విజయవాడ, రాజమండ్రి, గుంటూరు మొదలయిన పట్టణాలలో థియేటర్లు నిర్మించి నాటక సమాజాలకు, ప్రజలకు తోడ్పడవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉన్నది. అన్ని హంగులతోను థియేటర్లు మనకి అమరిననాడు చక్కని నాటకాలు ప్రదర్శింపబడుతూ ఉంటవి. ఉత్తమ నటులూ వస్తారు. వారిలోంచి ఏటా చిత్రాల్లోకి ఇద్దరిని ఎన్నుకోవచ్చును." అన్నారు శ్రీ బి. యన్. రెడ్డి. యుటీవల వారిని "రంగుల రాట్నం" సెట్‌లో కలుసుకున్నప్పుడు "లలితకళలు, చేతి పనులూ బోధించే పాఠశాలలు కూడా మనకి లేవు. వాటిని విరివిగా ఆంధ్రలో ప్రవేశపెడితే నిరుద్యోగుల సమస్య అంత ఎక్కువగా ఉండదు. ఈ విద్యలు చేతిలో ఉన్నవాడు వారి జీవనోపాధికి ఎట్టి లోపమూ కలుగదు" అని కూడ అన్నారు.

## స తీ సు మ తి

కౌశికుడు తాగుడు మైకంతో ఇల్లు గుల్ల చేసుకున్నాడు. వేశ్యావ్యామోహంలో ఒళ్ళు పాడు చేసుకున్నాడు. వైద్యులు వచ్చి పరీక్షించారు. పెదవి విరచి వెళ్ళారు. మోహనాంగిని చేరువకు పిలిచి "వైద్యులు ఏకాంతంగా ఏమి సెలవిచ్చారు?" అని అడిగాడు కౌశికుడు. "ఇదేదో భయంకరమైన విషజ్వరమట. మీరు వెంటనే మీ యింటికి వెళ్ళిపోవడం మంచిది." అన్నది మోహన. "ఎందుకూ?" "అక్కడయితే మీ యిల్లాలు సేవలతో యీవ్యాధి నుంచి త్వరగా కోలుకుంటారు" అన్నది. "ఆ సేవలో ఈ యింటిలో నీవు చేయవచ్చుగా!" _ "మా యిల్లు ఆనందనిలయమేకాని, చికిత్సాలయంకాదు. పైగా రోగులకు సేవలు చేయటం మాకు అలవాటు లేదు." అన్నది. కౌశికునిలో ఉద్రేకం చెలరేగింది. "అందాలు ఎర చూపి, ఐశ్వర్యాలు అపహరించడం మీ అలవాటా?" "ఎవరి అలవాటు వారివి. ఎంచుకోవడం ఎవరికీ మంచిది కాదు. పదీ, చప్పుడూ లేకుండా మీ యింటికి వెళ్ళడం మీకూ, మాకూ మర్యాద", "ఏమన్నావ్?" అన్నాడు. "మీ కిక్కడ సేవలు చేసేవారు లేరని మరోసారి చెబుతున్నా" "నా సొమ్ము తిన్నవాళ్ళు నా సేవలు చెయ్యలేరా?" కౌశికుని యీ ప్రశ్న విని మోహనకు చిరాకు వేసింది "చేయవలసిన సేవలు ఎప్పుడో చేశాను. మీకు అక్కర మయిన చాకిరీ చేయడానికి నేనేం కట్టుకున్న యిల్లాలిని కాదు" అన్నది. "నీ బహిరసౌందర్యానికి భ్రమసిపోయి, నన్నే దైవంలా పూజించే భార్యను దూరం చేసుకున్నాను. చేయరాని మహాపరాధం చేశాను!" అన్నాడు.

చిన్నిబ్రదర్స్‌వారి "సతీసుమతి" చిత్రంలోనిదీ దృశ్యం. కౌశికుడు కాంతారావు, సుమతి అంజలీదేవి, మోహనాంగి కాంచన. రచన: సముద్రాల, సంగీతం: ఆదినారాయణరావు, దర్శకుడు: వేదాంతం రాఘవయ్య.

—మోహన్ కుమార్



'ఇద్దరు మొనగాళ్లు'లో సంధ్యారాణి

# అవీ - యివీ

వందన సమర్పణ చేశారు.

## కుమారి వసంతలక్ష్మి



ఇటీవల మైలాపూర్‌లోని 'చిల్డ్రన్స్ గార్డెన్ స్కూల్' ఆవరణలో 'బృందావన్ ఫైన్ ఆర్ట్స్' విద్యార్థిని కుమారి ఆర్. వసంతలక్ష్మి భరతనాట్య అరంగేట్ర ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. శ్రీ యస్. భూపాల్ శిష్యురాలైన ఈ పదేండ్ల సౌభాగ్యవతి ఎంతో చక్కని అభినయం చేసింది. భావ ప్రకటనలో మంచి నేర్పు ప్రదర్శించింది. వసంతలక్ష్మి నృత్యానికి శ్రీ టి. వి. నరసింహులు గారి సంగీతం వన్నె తీసుకువచ్చింది. కార్యదర్శి శ్రీమతి ఎ. టి. సుందరమ్మ ఆ కార్యక్రమానికి విచ్చేసిన సభాసదులకు కృతజ్ఞత లర్పించారు.

## యడవల్లి రమ అరవయ్యోవ నృత్య ప్రదర్శన

వెంపటి చినసత్యంగారి శిష్యురాలు, కుమారి యడవల్లి రమ ఇటీవల అరవయ్యోవ నృత్యప్రదర్శనం ఇచ్చింది. ఆమె సోదరి కుమారి స్వర్ణకుమారి గాత్రం సాయంతో ఆంధ్రదేశమంతటా తిరిగి, మంచిపేరు ప్రఖ్యాతులు గడించుకున్న రమ వచ్చేనెల మధ్యప్రదేశ్, బెంగాల్, బీహార్‌లలో పర్యటించి నాట్యప్రదర్శన లిస్తుంది.

## ఢిల్లీలో ఎం. ఎస్. రామారావు గానకచ్చేరి

దక్షిణ భారత నటీనటుల సమాఖ్య ఆధ్వర్యాన ఇటీవల సుప్రసిద్ధ గాయకుడు శ్రీ ఎం.ఎస్. రామారావు కచేరి జరిగింది. కిద్వాయ్‌నగర్ కమ్యూనిటీ హాలులో జరిగిన ఈ గాన కచేరికి వందలాది ఆంధ్రులు, ఆంధ్రేతరులు విచ్చేశారు.

శ్రీ రామారావు గారు గంటన్నర సేపు అష్టపదులు, ఎంకిపాటలు, సినిమాపాటలు వీనుల విందుగా వినిపించారు.

సమాఖ్య తరఫున అధ్యక్షులు శ్రీ ఎం.వి. సుబ్బారావు శ్రీ రామారావుగారికి పంచెల చాపు, కండువా బహూకరించి సత్కరించారు.

శ్రీ రామారావు ఒక సాయంత్రం రాష్ట్రపతి భవనంలో ఏర్పాటైన ప్రత్యేక సమావేశంలో రాష్ట్రపతి డా. ఎస్. రాధాకృష్ణన్ సమక్షంలో కూడా ఒక గంట సేపు పాడి ఆయన అభినందనల నందుకున్నారు.

## విల్లివాకం తెలుగు పఠన మందిరం

విల్లివాకం తెలుగు పఠన మందిర 4 వ వార్షికోత్సవం ఐ.సి.యఫ్. న్యూ ఆడిటోరియంలో డాక్టరు పి. సత్యనారాయణగారి అధ్యక్షతన జరిగినది. ప్రఖ్యాత సినీనటులు శ్రీ కాంతారావు దంపతులు, శ్రీ రాజనాల గార్లు పాల్గొనిరి. కాంతారావుగారు పఠనమందిరం అభివృద్ధికి తమ దంపతుల తరఫున నూటపదహారు రూపాయలు, శ్రీ రాజనాల నూటపదహారు రూపాయలు బహూకరించారు.

పఠన మందిరం నిర్వహించిన ఆటల పోటీలలో గెలుపొందిన వారికి శ్రీ కాంతారావు గారిచే బహుమతి ప్రదానం జరిగినది. తర్వాత పఠనమందిర సభ్యులు శ్రీ యం. సుబ్బారావుగారి పిటకచేరి, శ్రీ యస్. ఆర్. నందగారి 'వాన వెలిసింది' నాటికను శ్రీయుతులు బి. లక్ష్మీపతి, కె. లక్ష్మణరావు, యస్. భ్రమరాచారి, సి. హెచ్. కోటేశ్వరరావుగార్లు రసవత్తరంగా ప్రదర్శించారు. శ్రీ యస్. సోమరాజుగారు వందన సమర్పణ చేశారు.

## శ్రీ వేణు మాధవ్

ఇటీవల బొబ్బిలి రాజావారి కళాశాల ఆవరణలో 'ధ్వన్యనుకరణ సామ్రాట్', శ్రీ యస్. వేణుమాధవ్‌కు సన్మానం జరిగింది. ఈ సందర్భంలో 'త్యాగమూర్తులు' అనే నాటకం ప్రదర్శింపబడింది. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ జి. సుబ్బిరెడ్డి వేణుమాధవ్‌ను సభికులకు పరిచయం చేశారు.

## గేయ నాటక ప్రదర్శనం

ఈ నెల 10, 11 తేదీలలో నాట్య విద్యాలయ విద్యార్థిబృందం వారు రవీంద్ర భారతి మొదటి అంతస్తులో గల తమ ఆవరణలో 'ఆశ' అనే వచన గేయ నాటకం క్రొత్త రీతిలో ప్రదర్శించారు.

'ఆశ' రచయిత శ్రీ కుందుర్తి ఆంజనేయులు. క్రొత్త తరహాలో సాగిన ప్రథమ వచన గేయ నాటకం. కవి, కాలం, చరిత్ర, ఆశ, అనాథం, ఇద్దరు గుమాస్తాలు, జవాను ఇందులోని పాత్రలు. రంగస్థలం నిర్మాణం విచిత్రంగా వుంది. తెరలు లేవు. నాలుగువైపులనుంచి ప్రవేశనిష్క్రమణలు జరుగుతాయి. ఒకవైపున "గ్రీన్‌రూం" వుంటుంది. ప్రేక్షకులు రెండు వైపులా వుంటారు. ఇలా వుండటంవల్ల వారు నటీనటులకు మరింత చేరువ అవుతారు. మన ప్రాచీన రంగస్థల రూపాలలో ఇది ఒకటి. విద్యార్థులైనా శ్రమించి నటన స్థాయిని పెంచుకున్నారు. దీనిలో కుమారి లక్ష్మి, కుమారి మణి శ్రీయుతులు చైనులు రామగోపాల్, చలపతిరావు, విశ్వేశ్వరరావు, అప్పప్ప, ఆదినారాయణ, సుందరేశ్వరరావు పాల్గొన్నారు. సాంకేతిక బృందంలో శ్రీయుతులు సుబ్బారావు, పాండురంగారావు, మల్లికార్జునరావు, కిశోర్, సాయిబాబా, వీరభద్రయ్య వున్నారు.

ఇట్టి ప్రయోగాత్మక నాటకాన్ని అందించిన నాట్యవిద్యాలయ వారు, నాట్యవిద్యాలయ డైరెక్టరు శ్రీ ఏ. ఆర్. కృష్ణ అభినందనీయులు.

ఓ. వి. శ్రీ

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.

